*Issued on 17—6—1955*




# THE
# ANDHRA LEGISLATIVE ASSEMBLY

## DEBATES

## (CAMP) WALTAIR

## OFFICIAL REPORT

## SATURDAY, THE 29TH MAY 1954.

## VOLUME IX—NO. 4

*CONTENTS*



PRINTED AT
SREE RAMA PRESS,
*MADRAS—21.*
FOR THE SUPERINTENDENT, ANDHRA GOVERNMENT PRESS,
KURNOOL.
1955
PRICE: 6 *annas*

# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY

**SATURDAY, the 29th May 1954.**

The House met in the T. L. N. Hall, Andhra University Campus, Waltair, at nine of the clock, the Deputy Speaker, (Sri Pasala Suryachandra Rao) in the Chair.

## QUESTIONS AND ANSWERS

### Starred Questions

### STARRED QUESTIONS POSTPONED FROM THE LIST FOR 26-5-1951.

### REPAIR OF THE BREACHED TANKS IN NELLORE DISTRICT

* 715 Q :—Sri S. Kasi Reddi:—Will the Hon. the Minster for land Revenue be pleased to state :

(*a*) whether the Government have received representations in the last October from the ryots as well as M. L. As. of Nellore District that early steps should be taken to repair the breached tanks due to heavy rains in October;

(*b*) the number of tanks completed so far in each taluk of Nellore District:

(*c*) the number of tanks that are not yet completed; and

(*d*) when they are likely to be completed ?

The Hon. Sri K. Koti Reddi:—(*a*) The answer is in the affirmative.

(*b*) (*c*) and (*d*) Steps were undertaken immediately after the rains for forming ring bunds to most of the minor irrigation tanks which breached and also for permanently closing the breaches. Subsequently estimates were got prepared and sanctioned for closing breaches and the works were also given on contract except in 12 cases in which the works could not be taken up for execution as the tanks contained water. A statement containing the details of particulars required is placed on the Table of the House

| | |
|---|---|
| The number of works in progress | 12 |
| The number of works yet to be started | 3 |
| The number of works under construction | 6 |

[29th May 1954

అక్కడ 12 చెరువులు తెగినవి వాటిలో నీళ్లు ఉండినదానివల్ల అప్పుడు మరమ్మతులు చేయడానికి వీలులేకుండా ఉండినది ఇప్పుడు telegraphic information తెప్పించాము. దానిప్రకారము, 12 చెరువులలో

| | |
|---|---|
| The number of works in progress | 6 |
| The number of works yet to be started | 3 |
| The number of works under construction | 1 |
| The number of works completed | 2 |

అని latest report 25 వ తేదీన వచ్చింది.

Sri S K. Kasi Reddi — అధ్యక్షా ! పోయినసంవత్సర తెగిపోయి నటువంటి చెరువులు ఇంకా ఇప్పటికీ చాలా repair కావలసినటువంటివి ఉన్నాయి. కొన్ని చెరువులు చాలా ప్రమాదకరమైనపరిస్థితులలో ఉన్నాయి. అటువంటప్పుడు వర్షాలు వచ్చేలోపల చర్యలుతీసుకొని వాటిని repair చేయడానికి ప్రభుత్వము ఆర్డర్లు పంపిస్తుందా?

The Hon. Sri Koti Reddi — సాధ్యమైనంతత్వరలో అవి complete చేయడానికి కావలసినప్రయత్నము ప్రభుత్వము చేస్తుంది.

Sri K. Ramiah Chowdary — అధ్యక్షా ! ఉదయగిరి తాలూకాలో 4 చెరువులు తెగిపోయినాయి. వాటిలో రెండు complete చేశామని, మిగిలిన రెండు 31-3-54 లోపల complete చేస్తారని చెప్పారు. ఆ తేదీ అయిపోయింది. కాని ఇంతవరకు వాటిని complete చేయలేదు. అంతేకాకుండా తెగిపోయినటువంటి చెరువుల list లో చేర్చకుండా ఉండేటటువంటి 4 చెరువులున్నవి. ఆ విషయాన్ని మంత్రిగారి దృష్టికికూడ తెచ్చాము. కనుక ఇప్పటికైనా ప్రభుత్వము వీటివిషయమై తీవ్రమైన చర్యతీసుకొని ఆ తెగిపోయినటువంటి చెరువులను బాగుచేయడానికి పూనుకొంటారా ?

The Hon. Sri K. Koti Reddi — ఆ information అంతా Collector కు పంపించి త్వరగా complete చేయవలసిందనిచెప్పి ఉత్తర్వులు పంపించాము.

## DIET TO THE TAPPER-SATYAGRAHIS CONVICTED IN KRISHNA DISTRICT

*680A Q :— Sri G. Latchnna :— Will the Hon. the Minister for Finance and Law be pleased to state:

*(a)* whether it is a fact that "cholam" is being given as diet to the tapper-Satyagrahis, who were convicted in Krishna District after 15th instant; and

*(b)* if so, the reasons?

The Hon. Sri T. Viswanatham —రాజమండ్రి జైలులో ఉన్నటువంటి ఈ కల్లుగీత సత్యాగ్రహులకు అన్నము 8 ఔన్సులు, 8 ఔన్సులు జొన్నలు ఇతర పదార్థాలు ఇదివరకు ఏవిధంగా నిర్ణయించారో, అదే మోస్తరుగానే ఇస్తున్నారు.

Sri N V. Rama Rao : — జైళ్లలో సగము rice, సగము చోళము, ఇంకా ఇతరపదార్థాలు ఇస్తున్నారని అన్నారు. అటువంటివి ఏవో explain చేస్తారా ? చోళము ఇవ్వడానికి కారణమేమిటి ?

The Hon Sri T. Viswanatham .— గవర్నమెంటు అవిధంగా ఆర్డరు ass చేయలేదు. అక్కడ convicting Magistrate ఏది వ్రాస్తారో, దాని ప్రకారము diet issue చేస్తారు. ఈ diet మార్చాలని మీ అభిప్రాయమైతే తప్పకుండా దాన్ని ఆలోచిస్తాము.

Sri. K. Rajagopala Rao — అయ్యా! రామమూర్తికమిటీ రిపోర్టును అమలుజరుపవలసిందని సత్యాగ్రహముచేశారు. ఆ రిపోర్టును అమలుజరుపవలసిందని ఈ సభవారు కూడ తమ అభిప్రాయాన్ని వెల్లడిచేశారు. కనుక ఇప్పుడు వారిని విడుదల చేయడానికి ప్రభుత్వము ప్రయత్నిస్తుందా ?

The Hon. Sri T. Viswanatham :— ఇటువంటి ప్రశ్నవేస్తే దీనికి ఇప్పుడు జవాబురాదు అని వారికి తెలిసికూడ వేశారు. ప్రత్యేకంగా ప్రశ్నవేయండి చెప్పుతాను.

Sri Pillalamarri Venkateswarlu :— Convicting Magistrate చోళము అని వ్రాసినప్పటికికూడ, ఖైదీ ఇతర diet ఇవ్వవలసిందని petition పెట్టుకొంటె, ఖైదీకోరినటువంటి diet ఇవ్వడానికి అవకాశముంటుందా ? ప్రభుత్వము దానిని consider చేస్తుందా ?

The Hon. Sri T. Viswanatham :— Prisoner కోరితే తప్పకుండా మార్చడానికి consider చేస్తాము. ఇప్పుడుకూడ prisoner కోరలేదు, మరొకరు కోరారు. దానిమీదకూడ చర్యతీసుకోడానికి ప్రయత్నంచేస్తాము.

Sri V. Rama Rao :— Convict చేయబడ్డ ఖైదీలు ముఖ్యంగా గుడివాడ, బందరువగైరా తాలూకాలనుంచి వెళ్లినవారే. వారు rice diet కు అలవాటుపడ్డవారు. మరొక diet వారికి అలవాటులేనందున, వారికి యీ rice diet మాత్రమే యిచ్చేటట్లుగా ప్రభుత్వము ఉత్తరువులుచేస్తారా ?

The Hon. Sri T. Viswanatham :— అందరికి rice diet తప్పకుండా యివ్వాలని అనుకున్నట్లయితే, తప్పకుండా యిచ్చేటట్లు చేస్తాను.

[29th May 1954

## STARRED QUESTION POSTPOND FROM THE LIST FOR 28-5-1954.

## MAHAJARS FROM THE LORRY OWNERS OF MADANAPALLI

*676 Q:— Sri D. Seetharamaiah :— Will the Hon. the Deputy Chief Minister be pleased to state:

(a) whether the Government have received any Mahajars in February 1954 from the Lorry owners of Madanapalli for the issue of permits to the lorries for the entire State and for reduction of surcharge on Motor Vehicles; and

(b) the action taken on these Mahajars?

The Hon. Sri N. Sanjeeva Reddi.— ఈ ప్రశ్నకు జవాబు నిన్ననే చెప్పాను. అయిన మరల యీ రోజున అడుగుతున్నారు కాబట్టి చెబుతున్నాను.

(a) The answer is in the negative.

(b) Does not arise.

Sri D. Sitaramaiah :— అధ్యక్షా! ఈ రాష్ట్రములో సరకులు రవాణా విషయములో లారీలు ప్రముఖపాత్రవహిస్తున్నాయి. వాటి పర్మిట్లు కొన్నిరూట్సుకు మాత్రమే పరిమితంచేయబడుచున్నాయి. ఈ లారీల కివ్వబడిన రూట్సుకు ప్రక్కగా 20 లేక 25 మైళ్లలోవున్న గ్రామాలకు సరకులను లోడ్ చేయుటకు, అన్‌లోడ్ చేయుటకు ప్రస్తుతం వీలులేకుండావుంది. అలాగు వెళ్లిన లారీలపై పోలీసులు కేసులుపెట్టుచున్నారు. కొన్నిసందర్భాలలో ఒకే నేరానికి రెండుకేసులుకూడా పెట్టుచున్నారు. ఇంతేకాక పోలీసులు ఆట్టివారినుండి లంచాలు, మామూళ్లు కాజేస్తూ చాలా యిబ్బందులు పెట్టుతున్నారు. ఇటువంటి యిబ్బందులు రాకుండా రాష్ట్రము అంతటికి వుపయోగించుకోటానికి వీలుగా ఒకే పర్మిట్టు లారీలవారికి యిచ్చేటట్టుగా చేస్తారా?

The Hon. Sri N. Sanjeeva Reddi :— లారీలు స్టేటులో కొన్నికొన్ని చోట్లలోమాత్రమే తిరుగటానికి ప్రభుత్వము పర్మిటుయిస్తున్నది. స్టేటు అంతటా తిరిగే టట్టుగా పర్మిటుచేయమంటే, వాటిని check చేయడము కష్టము. ఏ జిల్లాలోని లారీలను ఆ జిల్లాలో తిరిగేటట్టు చేస్తేనే, check చేయటము సులభమని ప్రభుత్వముయొక్క ఉద్దేశ్యము. ఒకవేళ ఏదైనా గ్రామానికి లారీ కావాలంటే, దానికి స్పెషల్‌గా పర్మిటుకోసం వ్రాసుకుంటే, యిస్తాము. If the request is reasonable it will be considered. అంతేకాని స్టేటు అంతటికి యివ్వటానికంటే, అది వీలుకానిపని.

29th May 1954]

## SUPPLY OF ELECTRICITY FOR IRRIGATION PURPOSES IN NUZVID AND TIRUVUR TALUKS

*681 Q.— Sri G. Rama Rao.— Will the Hon. the Deputy Chief Minister be pleased to state:

(a) whether any representation was made by the Ryot Sang Association and by ryots of Nuzvid and Tiruvur taluks for supply of electricity for irrigation purposes and also for the suspension of contributions from ryots for the supply of electricity;

(b) whether the above two taluks are included in the Development schemes; and

(c) the number of wells for which electric supply plants were permitted in the above two taluks and the total amount of contribution called for from them?

The Hon. Sri N. Sanjeeva Reddi :—

(a) The answer is in the affirmative.

(b) Yes. The two taluks will benefit from general development scheme included in the Five Year Plan of the State and have also been selected as National Extension Service Blocks in the Krishna District.

(c) In Nuzvid taluk 146 wells have been supplied with electricity and the total amount of loan called for in respect of them is Rs. 1,90,500/- whereas in respect of Tiruvur taluk the particulars are 'Nil'.

Sri G Rama Rao :— అధ్యక్షా ! ఈ Electric supply Extension Scheme విషయములో ఒకజాబితా యిచ్చారు. ఆ జాబితాలో నూజివీడు, తిరువూరు తాలూకాలు లేకపోవటానికి కారణమేమి ?

The Hon. Sri N. Sanjeeva Reddi :— జాబితాలో లేవు అంటే, లేవు అన్నమాటే. రాష్ట్రములలోవున్న తాలూకాలలోని గ్రామాలన్ని లేవు ఎందుకండి అంటే, నేను ఏమిచెప్పాలి. ఈ తడవ వీలు అయినన్ని చేర్చబడ్డాయి. మిగతావి యింకొకసారి తయారుచేసే జాబితాలోకి వస్తాయి. అంతేగాని, అన్ని ఒకేటూరి రావాలంటే, వీలు అవుతుందా ? కొన్ని ఒకతడవ, మరికొన్ని యింకొకతడవ, మిగిలినవి మరొకతడవ వస్తాయి.

Sri P. Gunnaiah :— అధ్యక్షా ! Electricity supply చేసే స్కీమువిషయములో National Extension స్కీముక్రింద తీసుకొన్న blocks కు మొదటుసష్టయి చేస్తారా ?

The Hon Sri N. Sanjeeva Reddi — సరే, ఆ విధంగా సప్లయిచేయడము మంచిదే. ధర్మము కూడాను. కాని ఆటువంటిబ్లాకు్స చాలావున్నప్పుడు వీటన్నిటికి సప్లయి చేయాలంటే, delay అవుతుంది. అయినప్పటికి, వీలుగావుంటే, ప్రయత్నముచేస్తాము.

Sri T Lakshminarayana Reddi — రైతుసంఘంవారు ప్రభుత్వానికి యిచ్చిన మెమోరాండాలపైన ప్రభుత్వము తీసుకున్నచర్య ఏమిటో ఆ సంఘానికి తెలియజేశారా ? తెలుపకపోతే, యిప్పటికైనా తెలుపటానికి ప్రయత్నిస్తుందా ?

The Hon Sri N Sanjeeva Reddi :— ఆ మెమోరాండాలు దేనిని గురించో, ఏ ప్రాంతంనుంచో, విపులంగా తెలుపకపోతే, ఆ రకమైన ప్రశ్నకు నేను జవాబు చెప్పలేను. ఒకవేళ representations వచ్చివుంటే, వీటినిగురించి ఆలోచిస్తాను. కాని వారు అడిగినవాటిల్లో కొన్ని accept చేయటానికి వీలు అవుతుంది, కొన్ని వీలుండదు.

Sri Pragada Kotaiah :— Electricity supply చేసేవిషయములో కొన్ని సూచనలు చేయబడినవి. అవి ప్రభుత్వపరిశీలనలో వున్నాయా, లేక నిరాకరించబడ్డాయా ? లేకపోతే, కనీసము వాటినిగురించి ఏమయిందన్నీ, ప్రభుత్వమునుంచి ఒక సమాధానమైనా పంపేటట్లుగా ప్రయత్నిస్తారా ?

The Hon. Sri N. Sanjeeva Reddi — శ్రీ ప్రగడ కోటయ్యగారు చీరాలసంగతి చెప్పారు. ఆ టౌనును include చేసినప్పుడు, యిక దానినిగురించి సమాధానము ఎందుకు ? ఆ ప్రాంతానికి అంతటికికూడా electricity సరఫరాచేస్తామని వేరే చెప్పనవసరముండదు.

## SHIFTING OF THE OFFICE OF THE ASSISTANT ENGINEER FROM KANIGIRI TO KAVALI

*682 Q:— Sri G. Yellamanda Reddi:— Will the Hon. the Minister for Land Revenue be pleased to state:

*(a)* why the office of the Assistant Engineer (Food Production) Kanigiri (Nellore district) has been shifted from Kanigiri to Kavali 60 miles away from the taluks for which sub-division was sanctioned; and

*(b)* whether the Government will be pleased to shift back the office to Kanigiri?

The Hon. Sri N. Sanjeeva Reddi:

*(a)* The office of the Assistant Engineer, Kanigiri, was shifted to Kavali for administrative convenience.

*(b)* The Government regret that it is not possible to shift back the office to Kanigiri.

29th May 1954]

Sri P. Rama Rao :— అధ్యక్షా! ఇప్పుడు యీ తిరువూరు, నూజివీడు తాలూకాలు Firka Development స్కీము క్రిందవున్నవి. అక్కడ District Rural Welfare Committees యీ తాలూకాల అభివృద్ధికొరకు electricity scheme అమలుజరపాలని చెప్పినప్పటికి యింతవరకు తిరువూరుతాలూకాకు electricity ఇవ్వలేదు. నూజివీడు తాలూకాలోమాత్రం కొన్నిచోట్ల బావులకు ఆర్డరు యిచ్చాము అన్నారు. బావులమీద కంట్రిబ్యూషను వసూలుచేయ మని చెప్పారా?

The Hon. Sri N Sanjeeva Reddi — బావులనుగురించి మాత్రం ప్రభుత్వము చర్యతీసుకుంటున్నది. వాటికిమాత్రము యివ్వమనిచెప్పారు. వీట్లలో ఏవి తీసుకొన్నారో తెలియదు. Plans and estimates మాత్రము తయారైనవి. రాష్ట్రములో estimates పూర్తి అయినవిమాత్రము తీసుకోమని అన్నాము. అందులో పూర్తిగా తయారై approve చేసినవి ఎక్కడెక్కడైతే వున్నాయో, వాటినిగురించి మాత్రం ఆలోచిస్తాము.

Sri G Yellamanda Reddi — అధ్యక్షా! కనిగిరి, దర్శి, పొదిలి తాలూకాలకు సంబంధించిన అసిస్టెంటు ఇంజనీరు ఆఫీసు administrative convenience అనే సాకుతో కావలికి మార్చామని అంటున్నారు. ఆ ఆఫీసు కనిగిరిలోవుంటే వచ్చిన యిబ్బంది ఏమిటి ?

The Hon. Sri N. Sanjeeva Reddi :— కనిగిరికంటె, కావలికి ఆ సబ్ డివిషనుకు సంబంధించిన ప్రదేశాలకు వెళ్లటానికి రోడ్డు communication వసతులు చాలా బాగావున్నవి అందువల్ల ఆ ఆఫీసు కావలికి మార్చబడ్డది. పైగా సబ్ డివిషనల్ ఆఫీసుకూడా కావలిలోనేవున్నది. ఈ విషయాలు అన్నియు ప్రభుత్వము ఆలోచనచేసి మార్చింది. కావలి, ఉదయగిరి, కనిగిరి, కోవూరు వీటి అన్నిటికి, కావలినుంచి పోవటానికి వీలుగావుంటుంది. ఇది ప్రభుత్వమువారి అభిప్రాయము కాబట్టి, ప్రభుత్వము ఆ విధంగా చేసింది. వేరేయిబ్బందులు ఏమైనావున్నవంటె, అవి తెలియపరచండి, ఆలోచిస్తాము.

Sri K. Subba Reddi :— అధ్యక్షా! మంత్రిగారు administrative convenience అని ఒకతాలూకాకు సంబంధించిన ఆఫీసు మరొకతాలూకాలో పెట్టారు. గుంటూరులోవున్న Executive Engineer Office ఆ జిల్లానుంచితీసుకొనివెళ్లి మరొక జిల్లాలో పెట్టారు. ఆ విధంగా చేయడమువల్ల రైతులకు చాలాయిబ్బందులు కలుగుతున్నవి. కాబట్టి ఏ జిల్లాకు సంబంధించిన ఆఫీసు ఆ జిల్లాలో మరొకచోటనైనా పెట్టటానికి ప్రభుత్వము ప్రయత్నిస్తుందా?

The Hon. Sri N. Sanjeeva Reddi :— ఇది గుంటూరుజిల్లాకు చెందిన ప్రశ్నకాదు. గుంటూరుజిల్లాకు సంబంధించి వేరేప్రశ్న వేస్తే జవాబుచెబుతాము.

[29th May 1954

## FEE PAID ON APPEALS OR ORIGINAL PETITIONS PRESENTED BY RESIDENTS OF ANDHRA STATE BEFORE THE HIGH COURT AT MADRAS

*683 Q :— Sri K. Krishna Rao :— Will the Hon. the Minister for Finance and Law be pleased to state:

*(a)* whether it is a fact that the Court fee paid on appeals, or original petitions, presented by persons who are residents of Andhra State, before the High Court at Madras would go to the credit of the residuary Madras State and not to the credit of the Andhra State;

*(b)* if so, whether any steps have been taken by the Andhra Government to see that as from 1-10-1953 the court fee alluded would be credited to the revenues of the Andhra State; and

*(c)* if any steps have been taken, at what stage the matter stands ?

The Hon. Sri T. Viswanatham :—

*(a)* Yes.

*(b)* No.

*(c)* Does not arise.

Sri C. V. K. Rao —మద్రాసులో వున్నటువంటి High Court కు అయ్యే ఖర్చులు, యేవిధంగా ఆంధ్ర, మద్రాసు రాష్ట్రాలు భరిస్తాయో మంత్రిగారు తెలియజేస్తారా?

The Hon. Sri T. Viswanatham — ఆంధ్ర ఆక్టులో ఆ విషయం వ్రాసి వుంది. అది తమదగ్గరవున్నది.

Sri T. Nagi Reddi :— మనకు రావలసిన కోర్టు ఫీజు అంతా వస్తుందా? అంటే "లేదు" అని మంత్రిగారు చెప్పారు. అది యెందుకు రావటంలేదనేది చర్చనీయమైన విషయము. మన fees మనకు యెందువల్ల రావడములేదని అడుగుతున్నాను. ఇక్కడ Government యేమైనా steps తీసుకొన్నదా అంటే 'no' అని అన్నారు. ఎందుచేత తీసుకోలేదు? మనకు రావలసిన court fees, రాబట్టుకోకుండా వదలిపెడుతున్నారా?

ఆ తర్వాత పంపకము జూలైలో జరుగుతుంది. అంతవరకు అయ్యే common ఖర్చు మద్రాసు ప్రభుత్వంవారే భరిస్తారా?

కోర్టు ఒకటే అయినపుడు, మనంచెల్లించే fees కూడా Composite State కు మాత్రమే వర్తిస్తుందనేది కారణంకాదు, అది మనకుకూడా వర్తిస్తుంది. దానికయ్యే ఖర్చులు మనం భరించాలి. మనం యీ fees ద్వారా భరించగలము. కాబట్టి ఆ fees ద్వారా వచ్చేలాభం మనకు యెందుకు రాదు? మన Act యెక్కడ పెట్టుతున్నది?

The Hon Sri T Viswanatham — Act అభ్యంతరం పెట్టటంకాదు. Act లో ఆ మాదిరిగావుంది.

Sri Pillalamarri Venkateswarulu .— ఇప్పుడు Act లో ఆ మాదిరిగా వ్రాసివుందని చెబుతున్నారు. ఇక్కడనుంచి వెళ్లే petitions మీద వచ్చే fees Madras High Court కు పోతున్నవి. మనకు వచ్చే ఆదాయము మనకు వచ్చేటట్లు ప్రయత్నం చేస్తారా?

The Hon Sri T. Viswanatham — మీ ప్రశ్న అర్థంకాలేదు, మరొకసారి చెప్పండి.

Sri Pillalamarri Venkateswarlu .— ఈ వచ్చే Court fees నుండి High Court కు అయ్యే ఖర్చులుపోను, మిగిలినది మనకు యెంత రావాలో, ఆ డబ్బు రావడానికి కేంద్రప్రభుత్వంవారికి తెలియజేస్తారా?

The Hon Sri T Viswanatham:— రావలసినది అనేది ఒక assumption. ఆ Act ప్రకారము మనకు యేమీ రానక్కరలేదు. రావలసినదానిని ఒకదమ్మిడీ కూడా వదల దల్చలేదు.

## REPRESENTATIONS FROM THE HARIJANS OF PODILI FOR GRANT OF HOUSE SITES

*684 Q:— Sri S. Kasi Reddi:—Will the Hon. the Minister for Planning and Public Health be pleased to state:—

(a) whether the Government have received representations from the Harijans of Podili, Nellore District, requesting for the grant of house-sites; and

(b) if so, the action taken by the Government in the matter?

The Hon. Sri D. Sanjivayya:—

(a) Yes, Sir. Fifteen Harijans applied on 4-9-1953 to the Special Tahsildar, Podili, for the provision of house-sites.

[29th May 1954

(b) Under the existing rules, only such of those Harijans who relinquish their existing house sites unconditionally are eligible to get free sites granted to them. It is reported that the Harijans of Podili are not willing to relinquish their old sites. Hence the question of acquiring new lands for them could not be pursued.

(a) అవునండి. (b) 15 మంది హరిజనులు 4-9-53 వ తారీఖున, పొదిలి తహసీలుదారుగారికి యిండ్లస్థలాలనిమిత్తము ఒక అర్జీని పెట్టుకొన్నారు అందుకు, యిప్పుడు ప్రస్తుతమున్న నియమావళి ప్రకారము తమ నివేశస్థలాలను బేషరతుగా వాళ్లు relinquish చేయని కారణంచేత, క్రొత్తస్థలాలను యివ్వడానికి వీలులేకపోయినది. ఇప్పుడు అక్కడ వున్న హరిజనులు అందుకు వొప్పుకొనలేదు. అందువల్ల, క్రొత్తస్థలాలను యివ్వ వీలులేదు.

Sri G. Bapanayya :— ఇప్పుడువున్నస్థలాలు చాలకేకదా, క్రొత్తస్థలాలను వారు కోరినది. ఇప్పుడు వారున్నటువంటిస్థలాలను తప్పకుండా విడిచిపెట్టాలనే నిబంధన లేదు. అందుకు ప్రభుత్వమువారు అటువంటి యిబ్బందులు లేకుండాచేయడానికి, క్రొత్త స్థలాలను యివ్వడానికి ఆలోచిస్తారా ?

The Hon. Sri D. Sanjivayya :— ఆలోచిస్తాము.

Sri S. Narayanappa .— యిండ్ల నివేశస్థలాలవిషయంలో రాష్ట్రం మొత్తం మైన, అన్ని జిల్లాలలోను, తాలుకాలలోను హరిజనులు చాలావిపరీతంగా యిబ్బందులు, బాధలుపడుతున్నవిషయం ప్రభుత్వానికి తెలుసు. ఆ విషయంలో ప్రభుత్వానికికూడా represent చేశాము. కాబట్టి అన్ని జిల్లాలలోనూత్వరలో వారికి యిబ్బందులులేకుండా యిండ్లవసతి కలుగచేస్తామని, అందుకు ఒక పథకము తయారుచేస్తామని చెప్పారు. ఆ విధంగా తయారుచేయడానికి ప్రభుత్వము పూనుకొంటుందా ?

The Hon. Sri D. Sanjivayya :— తయారుచేస్తాము

Sri C. Pulla Reddi — గత Budget సమావేశములో యీ యిండ్ల స్థలాలను acquire చేయుటలో కొన్నియిబ్బందులు వున్నాయని, వాటిని తొలగించడానికిగాను, తరువాత సమావేశములో ఒక సమగ్రమైన బిల్లును తీసుకువస్తామని మంత్రిగారు సెల విచ్చారు. అది యిప్పటికి యెంతవరకు వచ్చింది ? ఏ stage లో వుంది ? ఎంతవరకు వచ్చి, అది ఆగిపోయినదో మంత్రిగారు చెబుతారా ?

The Hon. Sri D. Sanjivayya :— గత Assembly సమావేశములో దీనిపై చర్చ ముగిసిన, తరుణమే దీనివిషయంలోనే నేను తగుచర్య తీసుకొన్నాను. అయితే యిప్పుడు ఒక్కసారి sudden గా spring చేసి దానినిగూర్చి అడుగుతే నేను జవాబు చెప్పలేనుగాని, కొంత వ్యవధినిచ్చి ప్రత్యేకప్రశ్నవేస్తే, తప్పకుండా సమాధానం చెబుతాను.

29th May 1954]

Sri P. Pundarikakshacharyulu — కొన్ని గ్రామాలలోవుండే హరిజనులు క్రొత్తయిండ్ల నివేశస్థలాలకుగాను పూర్తిగా డబ్బుయిస్తామని, అందుకు Government ఆ నివేశస్థలాలను acquire చేసి తమకు యివ్వవలసినదని మహజరులు వచ్చాయి. దానివిష యంలో ప్రత్యేకశ్రద్ధవహించి, కాలవిలంబనలేకుండా Collectors నివేశస్థలాలను acquire చేయుటకొరకు ప్రభుత్వము వుత్తర్వులు యిచ్చేప్రయత్నం చేస్తారా?

The Hon. Sri D Sanjivayya — చేస్తామండి.

Sri P Venkatasubbayya :— ఇండ్ల నివేశస్థలాలకుగాను, హరిజనులు అర్ధ క్రయం కట్టాలను G. O. లో వున్నది. ఆ G O. నిబంధనలవల్ల హరిజనులు యిబ్బందులు పడుతున్నారని గత budget సమావేశంలో Revenue Minister గారు చెబుతూ, ఆవిష యంలో తాము ఆలోచనచేస్తామని చెప్పారు. అందువల్ల హరిజనాభ్యుదయశాఖామంత్రి గారు Revenue Minister గారిమీద pressure తీసుకువచ్చి ఆ G. O ను రద్దు చేయిస్తారా ?

The Hon Sri D Sanjivayya.— అసలు, యీ భూమిని స్వాధీనము చేసుకొనుటకు యెంతో డబ్బుకావాలి, సగము అనికాదు. ఎంత యివ్వగల్గుతారో అంతా తీసుకోమనివుంది ఆ వుత్తర్వులు అన్నీ మార్పుచేసి, అందరికీ వుచితంగా యివ్వమని వుత్త ర్వులు జారీ చేయబడ్డాయి.

Sri M Veerabhadram.— అధ్యక్షా, పాడిలి హరిజనులకు క్రొత్తగా house-sites యివ్వటం విషయంలో వారు తప్పనిసరిగా తాము కాపురమువుండే స్థలాలను విడిచిపెట్టాలని చెప్పటం ప్రభుత్వం విరమిస్తుందా ? ఆస్థలాలు చాలకే, యిప్పుడు, క్రొత్త స్థలాలను అడుగుతారు కాబట్టి, పాతస్థలాలనువిడిచిపెట్టమనకుండా ప్రభుత్వం చూస్తారా ? దానికి మంత్రి గారి సమాధానంనేమిటి ?

The Hon. Sri D. Sanjivayya :— దానికి సంబంధించిన సమాధానము యింతకు పూర్వమే చెప్పాను.

Sri P. Gunnayya :— అధ్యక్షా, మనరాష్ట్రంలో హరిజనులయిండ్ల నివేశ స్థలాలకు హరిజనాభివృద్ధికి కేటాయించిన డబ్బునుండి రు. 13,66,000 లు కేటాయిం చారు. కొంతమంది హరిజనులు కష్టపడి తమకువున్న ముంతలు, చెంబులు అమ్మి, Government కు యిండ్లస్థలాలనిమిత్తం deposits చేశారు. ప్రభుత్వమువారు ఆలాగున deposit చేసిన హరిజనులకు ఆ deposit లనైనా తిరిగి వారికి refund చేయడానికి ప్రయత్నిస్తారా ? అని నేను అడుగుచున్నాను.

The Hon. Sri D Sanjivayya :— Refund చేయవలసినదనే ప్రభుత్వము యొక్క వుద్దేశ్యము. కాని Auditor-General యెప్పుడైనా యేమైనాయిబ్బంది తెలిపితే, అటువంటి పరిస్థితులలో వీలుండదు కాని, యితరసమయాలలో refund చేయాలన్నాము.

Sri T Nagi Reddi — ఇప్పుడు తమకువున్న స్థలాలను ఖేషరతుగా వదలిపెడితే తప్ప క్రొత్తస్థలాలను యివ్వడానికి వీలులేదనుటకు, హారిజనులమీదను ప్రభుత్వకోపాన్ని యేమైనా ప్రసరించిందా? వారు అందులకు యేమైనాగురి అయినారా?

The Hon. Sri D Sanjivayya :— అది పూర్తిగా పొదిలికి సంబంధించినవిషయమైవుంది. హారిజనులు తప్పనిసరిగా విడిచిపెట్టాలన్న నిర్ణయం అప్పుడువున్నది దీని విషయంలో జాగ్రత్తగా అన్నిసౌకర్యాలు యిచ్చేనిమిత్తము యేర్పాటులు చేయాలని ఆలోచిస్తున్నాం. అటువంటి యేర్పాట్లు చేస్తామనిచెప్పాము

Sri G. Joseph :— అయ్యా, హారిజనులు ఇళ్లస్థలాలకోసం పిటిషన్లు పెట్టుకుంటే, ఆ భూములు కలిగిన రైతులు పిటిషన్లు పెట్టారనే ఉద్దేశంతో ఆభూములలో పెద్ద పెద్ద గోతులుపెట్టి మెట్టభూములను మాగాణి భూములుగా మార్చడానికి ప్రయత్నిస్తున్నారు. ఇలాటి స్థలాలను హారిజనులకు ఇస్తే పెద్ద ఖర్చౌతుంది. కాబట్టి ఆరైతులు గుంటలు పెట్టకుండా ఉండడానికి మీరేమైనాచర్య తీసుకుంటారా?

The Hon. Sri D Sanjivayya .— ప్రతిరైతుకు తన పొలాన్ని తన ఇష్టం వచ్చినట్లు ఉపయోగించుకొనేహక్కుంది. ప్రభుత్వం స్వాధీనంలో ఉన్నదానిలో వేస్తుంటే. అటువంటివి అరికట్టవచ్చు.

## WORKERS IN PULUGAMPALLY-NALLAMADA VENGALAMMA CHERUVU ROAD WORK

*685 Q:— SRI T. Lakshminarayana Reddi .— Will the Hon. the Minister for Local Administration and Agriculture be pleased to state the number of workers in Pulugampally - Nallamada - Vengalamma Cheruvu road working in low scale famine work from 15th to 20th September ?

**The Hon. Sri P. Thimma Reddi :—**

**The number of labourers employed is as follows :—**

| Date. | No. of labourers employed. |
|---|---|
| 15-9-1953. | 995 |
| 16-9-1953. | 1,210 |
| 17-9-1953. | 1,248 |
| 18-9-1953. | 2,006 |
| 19-9-1953. | 2,048 |
| 20-9-1953. | 235 |

29th May 1954]

అనంతపురంజిల్లాలోని పులుగంపల్లి, నల్లమడ వెంగాలమ్మ చెరువురోడులో పని జరుగుతున్న కాలంలో 15th September నుంచి 20th September వరకు ఈ క్రింది విధంగా పనివాళ్లను నియమించడమైంది

| Date | No of labourers employed |
|---|---|
| 15-9-1953 | 995 |
| 16-9-1953 | 1,210 |
| 17-9-1953 | 1,248 |
| 18-9-1953 | 2,006 |
| 19-9-1953 | 2,048 |
| 20-9-1953 | 235 |

Sri T Lakshminarayana Reddi — ఇది ఉమ్మడిరాష్ట్రంలో జరిగిన విషయం. కూలీలు గంజి కేంద్రాలుపెట్టాలని అడిగినవాళ్లమీద కేసులుపెట్టడం జరిగింది. ఇప్పుడున్న నూతనపరిస్థితులదృష్ట్యా, ఆ కేసులు తీసివేయడానికి ప్రయత్నంచేస్తారా ?

The Hon. Sri P Thimma Reddi — కేసులు ఎందుకుపెట్టారో నాకు తెలియదు. దానికి ప్రత్యేకప్రశ్నవేస్తే జవాబు చెప్తాను.

## POWER STATION AT KOVUR, NELLORE DISTRICT

*686 Q:— Sri B. Ramakrishna Reddi:— Will the Hon. the Deputy Chief Minister be pleased to state:

(a) the capacity of power that may be generated from the Power Station at Kovur, Nellore District.

(b) how much power is now utilised; and

(c) the reasons for not utilising the full capacity?

The Hon. Sri N. Sanjeeva Reddi:—

(a) The generating capacity of the Power Station at Kovur is about 9 lakhs of units per month.

(b) About 3·49 lakhs of units of power were utilised on an average during the months of March' 1953 to June, 1953.

(c) The demand has been very poor on account of several factors such as slow development of distribution and transmission systems owing to financial stringency and high cost of generation.

Sri B. Sankarayya:— ఇదివరకు మంత్రిగారు విద్యుచ్ఛక్తిసరఫరాగురించి జవాబు చెప్తూ, ఎస్టిమేట్లు పూర్తిచేసియున్నవాటిని ముందు తీసుకొని పనిచేస్తాం అని

[29th May 1954

చెప్పారు. ఆలా ఎస్టిమేట్సు అయి వాలంట్రీ కన్ట్రిబ్యూషన్ను రైతులు చెల్లించలేనందున నిలచిపోయినవి ఉన్నాయి. ఇటువంటివాటిని వెంటనే పూర్తిచేస్తారా?

The Hon Sri N. Sanjeeva Reddi ·— నిజంగా sanction అయినవి ఉంటె నాదృష్టికి తీసుకురమ్మని చెపుతున్నాను Department కు మామూలుగా general instructions ఇస్తాం. కాబట్టి ఆలా estimate అయినవి ఇంకా నాదృష్టికి అందిస్తే ప్రత్యేకంగా త్వరగా వానిని పూర్తిచేయడానికి ప్రయత్నం చేస్తాం.

Sri K Ramaiah Chowdary —గౌరవనీయులైన మంత్రిగారు జవాబు చెప్తూ ఇప్పుడు produce అయ్యేదానిలో తక్కువభాగం ఉపయోగపడుతోందని చెప్పారు. నెల్లూరు థర్మల్ స్టేషన్నుంచి ఉత్పత్తిఅయిన కరెంట్ చాలక ఇంకా ఎక్కువఉంటేకూడా ఉపయోగించుకోడానికి అవకాశంఉంది. మెట్టతాలూకాల్లో ఇంకా కావాలని కోరుతున్నారు. అక్కడ కావలసినంత డిమాండ్ ఉంది. కాబట్టి అక్కడ produce అయ్యే కరెంటును సప్లయిచేస్తారా అని అడుగుతున్నాను.

The Hon Sri N. Sanjeeva Reddi — నేను చెప్పిన జవాబును సరిగా అర్థంచేసుకోలేదు. అక్కడ సప్లయి కాకపోడానికి ట్రాన్స్మిషన్ లైన్స్ లేకపోవడం ఒకకారణం, cost ఎక్కువగా ఉండడం ఒకకారణం. Oil cost ఎక్కువ అయిపోయింది. దాన్నిబట్టి unit cost కూడా ఎక్కువ అయింది. అందువల్ల గిట్టుబాటుకాక రైతు నష్టపడుతున్నాడు. ఈ ఇబ్బంది లేకుండాచేయడానికి ప్రయత్నిస్తాం.

Sri C. V K Rao :— నెల్లూరులోనే కాదు, మోనాఫలీ మాకుకూడా ఉంది. ఇక్కడ 9 లక్షలయూనిట్లు జనరేట్ అవుతుందనిచెప్పారు. దానిలో 3-వ వంతు ఖర్చౌతున్నదని చెప్పారు. అంటే దాదాపు 2 వంతులు వృథా అవుతున్నది. ఇక్కడ యూనిట్ రేట్ తగ్గిస్తే ఎక్కువఖర్చుకు అవకాశం ఉంటుంది. కాబట్టి ధర తగ్గిస్తారా అని అడుగుతున్నాను.

The Hon Sri N Sanjeeva Reddi ·— వారు ప్రశ్న అర్థంచేసుకొనక పోతే ఎట్లా? దాని capacity ఎంతని అడిగారు తొమ్మిదిలక్షలని చెప్పాను.

We are not producing nine lakhs and giving 3·4 lakhs only and wasting the other things. The generating capacity is nine lakhs; we are producing only 3·4 lakhs and we are distributing what we are producing.

## FLOURINE AFFECTED PLACES IN DARSI AND PODILI TALUKS

*** 687 Q :— Sri S. Kasi Reddi :— Will the Hon. the Minister for Planning and Public Health be pleased to state :**

**(a) whether there are any flourine affected places in Darsi and Podili Taluks of Nellore District; and**

29th May 1954]

(*b*) if so, the places?

The Hon. Sri D. Sanjivayya :—
(*a*) and (*b*) Yes.

Including the three Head-quarters panchayat towns of Darsi, Podili and Kanigiri Taluks 19 out of 119 villages in Darsi, 15 out of 190 villages in Podili and 31 out of 800 villages in Kanigiri Taluks during 1938-39 survey showed the "Bone disease" due to Flourine intoxication whereas practically all the villages in the three taluks showed the "Mottled enamel" of the teeth. (pigmented bands on the surface of teeth).

Sri S Kasi Reddi ·— అధ్యక్షా! ఈ flourine affected ప్రాంతాల్లో ఈజబ్బు water లో ఉన్నందువల్ల 25 సంవత్సరాలు దాటినతరువాత యువకులకు మెడ, కాళ్లు పడిపోడం జరుగుతుంది. అటువంటివాళ్లకు పెళ్లిళ్ళుకూడాకావడం కష్టమాతున్నది. కాబట్టి దానికి preventive methods ఏమిటి? దాన్ని మాన్పడానికికూడా ఏమి చర్య తీసుకుంటారని అడుగుతున్నాను.

The Hon. Sri D. Sunjivayya — ఈవిషయమై survey 1938 లో జరిగింది. దాదాపు 16 సంవత్సరములకుపూర్వమే అయింది అపుడే. ఈ వ్యాధికి సంబంధించిన preventive measures కు చర్యలుతీసుకున్నారు. Director of Public Health గార్ని అచ్చటికిపోయి చూచిరమ్మని, ఆప్రాంతమును పరిశీలించి పరిస్థితులను ప్రభుత్వానికి చెప్పమని అడిగాము.

Sri T Nagi Reddi · — ఈ ప్రశ్న చాలా ప్రమాదకరంగా ఉన్నట్లే కన్పిస్తోంది. యువకులకు పెళ్లిళ్లు అవదనికూడా ఆ సభ్యుడు చెప్పాడు. అందువల్ల దీనిని గురించి తగుమైనటువంటి చర్యలను immediate గా ఆలస్యం జరుగకుండా ప్రభుత్వం తీసుకుంటుందా?

The Hon Sri D. Sanjivayya .— తప్పకుండా action తీసుకుంటాము. పెళ్లిళ్లుకావలసినవాళ్లకి పెళ్లిళ్లు తప్పకుండా అవుతాయి.

Sri S. Kasi Reddi ·— అధ్యక్షా! ఆప్రాంతంలో 1938 లోనే survey చేసి తెలుసుకొన్నప్పుడు, ఇన్నిరోజులనుంచి ప్రభుత్వం ఎందుకు preventive measures తీసుకోవడానికి ఆలస్యంచేస్తున్నది? దీనికి preventive measures తీసుకోడానికి మాత్రమే వీలుంటుంది. దీనిని cure చేయడం కష్టమని, తగినమందులు లేవని తెలుస్తోంది. దానిని నయం చేయడానికిగాను, తగిన research చేయించడానికి ప్రభుత్వం ఏమిచర్యలు తీసుకుంటున్నారు?

[29th May 1954

The Hon Sri D Sanjivayya — క్రితంసారి దీనిపై పరిశీలించిన Director of Public Health యిచ్చిన report ను కూడా పరిశీలించి, దీనియొక్క Preventive measures కి మాత్రమే కాకుండా cure కు కూడా తగిన చర్యలు తీసుకోవాలని చెప్పి Director of Public Health ను ఆదేశించాము. వారు రిపోర్టు పంపిస్తారు, పంపినతరువాత దానిపై తగినచర్య తీసుకొంటాము.

Sri R Siddanna Gowd — Point of information. ఈ flourine వ్యాధిగురించి, flourine అనేది ఏమిటో ఎవరికీ తెలియకుండా దీనిపైన ప్రశ్నపరంపరలు వేయడం జరిగింది. ఈవిధంగా దీనిపైన ప్రశ్నపరంపరలను వేయడం, సమాధానాలు యివ్వడం ఎలా జరిగిందో మంత్రిగారు తెలియజేయాలని కోరుతున్నాను.

The Hon Sri D Sanjivayya — ప్రశ్న వేసిన సభ్యునివలెనే నేనుకూడా ఈ subject లో layman నే. నాకూ ఈ subject గురించి అంతగా తెలియదు. కావాలంటే ఈవ్యాధివిషయం ఏమిటో చదివి తెలుసుకుంటాను. అపుడు మీకు తెలియ జేస్తాను.

## INSTALLATION OF PUMPING SETS ON THE BANK OF PALERU RIVER

*688 Q:—Sri G. Yellamanda Reddi:—Will the Hon. the Minister for Local Administration and Agriculture be pleased to state whether any representations have been received for installing pumping sets on the bank of Paleru river for supplying water to the agricultural fields on condition that the ryots will pay Rs. 25/- maximum per acre in Kanigiri Taluk, Nellore District?

The Hon. Sri P. Thimma Reddi:—

No, Sir.

Representations ఏమీ రాలేదు.

G. Yellamanda Reddi :—అధ్యక్షా! మంత్రిగారు, అలాంటి representations ఏమీరాలేదని అంటున్నారు ఆప్రాంతాలకు Director రావడం, పోవడం, తరువాత District Agricultural Officers ఎన్నోసార్లురావడం జరిగింది, వారికి ఎన్నోసార్లు అచ్చటివారు మెమొరాండం యివ్వడం, represantations పంపడం జరిగింది. మంత్రిగారికికూడా representations పంపడం జరిగింది. కాని మంత్రిగారు ఈ విషయమై representations రాలేదని చెప్తున్నారు. అలాకాకుండా అసలు representations వచ్చాయా లేదో మళ్లా తెలుసుకుంటారా? తెలుసుకొని దాని విషయమై తగుచర్య తీసుకొంటారా?

29th May 1954]

The Hon. Sri P. Thimma Reddi — ఈ ప్రశ్నకు నాకు department నుంచి వచ్చినజవాబు 'లేదు' అని. ఒకవేళ ఏమైనా representation వచ్చిందేమో మరల విచారణ చేస్తాను.

Sri L. Lakshmana Das — అధ్యక్షా! అసలు representation వచ్చినా రాకపోయినా ఈ నదులపైన వీలైనంతవరకు ఇటువంటి pumping sets ఏర్పాటుచేయటానికి ప్రభుత్వం ప్రయత్నిస్తారా? ఆంధ్రదేశంలో చాలావరకు నదులు ఉన్నాయి. వాటినీటిని ఉపయోగించడానికి వీలుంటుంది. వెంటనే ప్రభుత్వం pumping sets ను ప్రతినదిపైన పెట్టడానికి ప్రయత్నంచేస్తుందా? అని అడుగుతున్నాను?

The Hon. Sri P. Thimma Reddi — అధ్యక్షా! 1952 జూన్‌లో Co-operative Society లు ఏర్పాటుచేసుకొని ఈనదిజలాలను పంపింగ్ సెట్స్‌ద్వారా వినియోగించుకోడానికి ప్రభుత్వం సహాయం చేస్తామన్నది. ఆవిధంగా ఎవరూ ముందుకు రాలేదు. Co-operative Society లవారు, వారికి ప్రభుత్వానికీ ఎవరికీ లాభంలేకుండా నష్టంలేకుండా ఈనదీజలాలను pumping చేసి రైతులకు సహాయం చేయడానికి ఏర్పాటు చేస్తే ఎక్కడైనాసరే, ఆసొసైటీలవారు ఈవిషయాన్ని ప్రభుత్వదృష్టికితీసుకువస్తే వారికి తప్పనిసరిగా సహాయం చేస్తుంది.

Sri K. V. Ramaswamy — విశాఖపట్నంజిల్లాలో చాలాభాగం మెట్ట ప్రాంతం అనేసంగతి ప్రభుత్వం గుర్తించిందనుకుంటాను అటువంటిచోట్ల co-operative societies ఉన్నా లేకపోయినా వెంటనే ఈ pumping sets ను ఏర్పాటుచేయడానికి తగినచర్యలు తీసుకోడానికి ప్రభుత్వం ప్రయత్నిస్తారా అని అడుగుతున్నాను.

The Hon. Sri P. Thimma Reddi — ఈ pumping sets ఎక్కడెక్కడ అవసరమో అక్కడ ఏర్పాటుచేస్తాము. ఏఏగ్రామాలకు, ఏఏతాలూకాలకు అవసరమో, ఆవిషయం ఆయాప్రాంతములసభ్యులకు సంబంధించింది. వారు, ఆ ప్రాంతంలోని ప్రజలు మొదట కొంచెం ప్రయత్నంచేస్తే వారికి సహాయంచేయడానికి ప్రభుత్వంకూడా గట్టిగా ప్రయత్నం చేస్తుందని, అందుకు అనుమానంలేదని చెప్తున్నాను.

Sri M. Veerabhadram — ప్రభుత్వంవారు, రైతాంగమునకు Pumping sets ను ఏర్పాటు చేసుకోడానికి గాను, ఆ pumping sets ను supply చేస్తుందా?

The Hon. Sri P. Thimma Reddi — ఈమాదిరి ప్రశ్నకే సమాధానం చెప్పి 5 నిమిషాలుకూడా కాలేదు. మరల అదేప్రశ్నను అడగడంలో అర్థంలేదు. యిప్పుడే జవాబు చెప్పాను.

Sri K. Rajagopala Rao — ఉపాధ్యక్షా! అడిగినప్రశ్న ఒకటవుతోంది, చెప్పేసమాధానం యింకొకటవుతోంది మొత్తంమీద అడిగినప్రశ్నకు సమాధానం రావడం లేదు. అందుచేత ప్రశ్నలకు జవాబులు సరిగా చెప్పించాలని మిమ్మల్ని కోరుతున్నాను.

[29th May 1954

Deputy Speaker — సరైన సమాధానాలను చెప్పించడానికికాదు నేను యిక్కడ కూర్చుంట.

Sri. G Sivasankara Reddi — ఇలాంటి pumping sets ను install చేసినప్పుడు, ఎకరానికి 25 రూపాయలరేటును fix చేస్తే backward areas లోని రైతులు దానిని భరించడానికి కష్టంగా ఉంటుంది. అందువల్ల దానిని కొంచెం తగ్గించడానికి ఏమైనా ప్రయత్నిస్తారా?

The Hon Sri P. Thimma Reddi — ఆరేటు 25 రూపాయలో, 50 రూపాయలో పడుతుంది. ఎవరికీ లాభంగాని నష్టంగాని లేకుండాఉండే, ఏ plan నైనా తయారుచేస్తే ప్రభుత్వం అంగీకరించి దానికి పూనుకుంటుంది.

Sri G. Yellamanda Reddi — అధ్యక్షా! ప్రభుత్వానికి ఏమీ representation రాలేదని చెప్తున్నారు. ఎప్పుడైనా ఆప్రాంతంలోనిరైతులు జిల్లా Agricultural Officer గారికి, ప్రభుత్వానికి ఏదైనా అర్జీపంపిఉంటే దానిగురించి ఆలోచిస్తారా?

The Hon. Sri P. Thimma Reddi — మరొక అర్జీని పంపించేట్లుగా ఉంటే దానిగురించి ఆలోచిస్తాము.

## ALLOWING LORRIES TO ENTER INTO OTHER STATES WITHOUT PAYING EXTRA TAX

*789 Q:— Sri D. Seetharamaiah — Will the Hon. the Deputy Chief Minister be pleased to state whether the Government of Andhra are proposing to negotiate with that of Madras for allowing lorries legally permitted by any one of these States to enter into the other State without paying extra tax?

The Hon. Sri N. Sanjeeva Reddi —

The Governments of Madras and Andhra have entered into a purely temporary arrangement for the quarters ending 31-12-1953, 31-3-1954and 30-6-1954, by which lorries of one State permitted to ply in the other State can do so without paying any extra tax.

## RESOLUTIONS PASSED BY THE EX-RAYALASEEMA DEVELOPMENT BOARD

*690 Q:— Sri P. Narasimha Reddi :— Will the Hon. the Minister for Planning and Public Health be pleased to state:

(a) the number of resolutions passed by the Ex-Rayalaseema Devolopment Board in itslifetime;

29th May 1954]

(b) the number out of them taken up by the Government and executed; and

(c) whether the Government intend to implement the remaining resolutions or drop them out?

The Hon. Sri D. Sanjivayya —

(a) The Rayalaseema Development Board passed 140 resolutions during its life time.

(b) Twenty resolutions have been implemented.

(c) The question of implementation of the resolutions other than those dropped by the Composite State Government is under consideration.

Sri T. Nagi Reddi — ఈ రాయలసీమ Development Board ఎన్ని సంవత్సరాలు పనిచేసింది? అసలు ఎన్ని resolutions చేసింది, వాటిని ఎంతవరకు implement చేశారు?

The Hon Sri D Sanjivayya — ఇంతవరకు pass చేసిన resolutions అన్నింటిని సాధ్యమైనంతత్వరలోనే implement చేయడానికి ప్రయత్నిస్తాము.

The Rayalaseema Development Board was constituted in August 1949.

Sri G. Nagabhushanam :— The Rayalaseema Development Board was constituted for the economic development of Rayalaseema. I want to know, is it in existence now, if not, when it was abolished?

The Hon. Sri D. Sanjivayya.— It was abolished on 14-1-1954, The reason is there are several recommendations yet to be implemented. From the answer I gave you, you will find that out of 140 resolutions only 20 have been implemented, and it is quite enough if we are able to implement the other resolutions.

Sri R. Siddanna Gowd.— ఉపాధ్యక్షా! నాకు యింతవరకు ఒక ప్రశ్న అడుగుదామన్నాకూడా మీరు అవకాశం యివ్వలేదు. అందుచేత........

Deputy Speaker :— నేనూ చూస్తున్నాను. అవకాశంవచ్చినప్పుడు పిలుస్తాను మిమ్మల్ని.

Sri N. Sivarami Reddi :— 140 తీర్మానములు చేశారన్నారు. అందులో 20 మాత్రమే implement చేశామన్నారు. వాటిని అమలుజరపడానికి ఎంత డబ్బు ఖర్చయింది? మిగతా 120 తీర్మానములను implement చేయడానికి ఎంత డబ్బు

ఖర్చవుతుంది ? వాటిని implement చేయడానికి ప్రయత్నిస్తారా ? అయితే అందుకు ఎన్నిఏళ్లు పడుతుంది ?

The Hon Sri D. Sanjivayya :— ఈ 120 తీర్మానాలను implement చేయడానికి ఎంతడబ్బు ఖర్చు అవుతుందో వివరంగా ఒక statement లో ఉంది. దానిని ఈ House యొక్క table మీద పెట్టడానికి ఏమీ అభ్యంతరం లేదు. ఈ scheme కు ఇంతఖర్చు అని వేసిన statement సవివరంగా ఉంది. Table మీద పెట్టమంటే పెడతాము.

Sri R. Siddanna Gowd :— ఈ Rayalaseema Development Board వ్యవహారములను ఏ డిపార్టుమెంట్, ఏ మంత్రిగారు చూస్తున్నారు. వేరే దీనికి ఎవరైనా Officer ఉన్నారా ?

The Hon. Sri D. Sanjivayya :— దీనిని ఆంధ్రప్రభుత్వం యావత్తూ అందరూ చూస్తున్నారు.

Sri T. Nagi Reddi :— 20 schemes execute చేశామన్నారు. వాటికి ఎంతడబ్బు ఖర్చయిందో తెలియజేస్తారా ?

The Hon. Sri D. Sanjivayya :— A similar question was put in the Legislative Assembly of the composite State of Madras by Sri C. V. K. Rao on 16-7-1953 asking for the particulars of the work done by the Rayalaseema Development Board and their recomendations and the decisions implemented, and a statement regarding it was placed on the table of the House. If need be I shall give the hon. Member a copy of it.

Sri T. Nagi Reddi :— అసలు 20 schemes execute చేశామన్నారు, వాటికి ఎంత ఖర్చయిందో చెప్పండి.

The Hon. Sri D. Sanjivayya :— It will not be possible to total them up; as I said, if need be, I shall give the Hon. Member a copy of the statement placed on the table of the House in the composite State of Madras.

Sri Pragada Kotayya :— అధ్యక్షా ! రాయలసీమ వెనుకబడివున్నది. 120 తీర్మానాలున్నాయి. రాయలసీమ Development Board రద్దుచేశారు. ఆంధ్రదేశంలో ఇతర వెనుకబడిన ప్రాంతాలున్నాయి. వాటి అభివృద్ధికి ఏదయినా ప్రయత్నంచేస్తారా ?

The Hon. Sri D. Sanjivayya :— అన్నివిధాలా ప్రయత్నిస్తూనేవున్నాం.

Sri B. Krishnamurthi Rao :— అధ్యక్షా ! రాష్ట్ర అవతరణ అనంతరము రాయలసీమబోర్డును రద్దుచేసినప్పటికీ ఆంధ్రరాష్ట్రంలో ఆర్థికంగా వెనుకబడిన ప్రాంతాల

వుండగా యీ విధమైనటువంటి బోర్డు నియమించడం సబబైనటువంటిదని ప్రభుత్వం భావిస్తున్నదా?

The Hon. Sri D Sanjivayya :— ఆ విషయం ఈ బోర్డు రద్దుకుపూర్వం ఆలోచించి, అవసరంలేదని అనుకొని మానుకున్నాం.

Sri M Veerabhadram — 20 తీర్మానాలు అమలుపరచడానికి ఎంత ఖర్చయినది అని C V K రావుగారు వుమ్మడి మద్రాసులో అడిగిన ప్రశ్నకు ఇదివరకే సమాధానమిచ్చామని చెప్పారు. C. V K రావుగారి ప్రశ్న (అనంతరం ఏమీ అమలు జరపలేదా?

The Hon Sri D Sanjivayya :— అది అమలులో నేవున్నది. వేరే అడగవలసిన అవసరం ఏమివున్నది?

Sri T Lakshminarayana Reddi — 691 వ ప్రశ్న రేపటికి వాయిదా వెయ్యండి లేకపోతే debate కు అవకాశం యివ్వండి. It may be simple for the Ministers but not for the members

Sri T. Nagi Reddi .— రేపటికి వాయిదా వెయ్యండి.

Deputy Speaker :— మంత్రిగారు జవాబు చదువుతారా, రేపటికి వాయిదా వేద్దామా?

The Hon. Sri P. Thimma Reddi .— నేను చదువుతాను

Sri T. Nagi Reddi — నా మనవి యేమిటంటే ఇందులో ఒక policy involve అయినది. ఫెడరేషనులో పనిచేస్తున్నాడు కాబట్టి తొలగించామని notice యిచ్చారు. అటువంటి policy involve అయినవిషయం యిది. కనుక రేపు అయితే నాలుగు సప్లిమెంటరీ questions కి అవకాశంవుంటుంది.

Deputy Speaker :— ప్రతిదీ ఏదో ఒకపాలసీకి సంబంధించేవుంటుంది. మంత్రిగారికి అభ్యంతరంలేకపోతే నాకు యేమీ అభ్యంతరంలేదు. ఇవ్వాళటి business యివ్వాళ పూర్తిచేయాలని చెబుతున్నాను.

The Hon. Sri N. Sanjeeva Reddi :— రెండు సప్లిమెంటరీ ప్రశ్నలు allow చేయండి.

## REMOVAL OF HANUMANTHAPPA FROM ANANTAPUR DISTRICT BOARD SERVICE

*** 691 Q :— Sri T. Lakshminarayana Reddi :—Will the Hon. the Minister for Local Administration and Agriculture be pleased to**

state the reasons for removing Sri R. Hanumanthappa, Secretary, District Federation from District Board Service?

The Hon Sri P Thimma Reddi —

R. Hanumanthappa, Ex-teacher Board Elementary School, was removed from service by the President, District Board, Anantapur for good and sufficient reason after an enquiry as prescribed by the Rules.

అనంతపురంజిల్లాలో R హనుమంతప్ప, అనే ఎలిమెంటరీస్కూలు టీచరును సర్వీసు నుండి తీసివేయడం అయినది విచారణచేసినతరువాత తీసివేయవలసిన కారణాలున్నట్లు తేలింది. కాబట్టి తీసివేయడమైనది.

Sri T. Nagi Reddi — I protest against the way in which the question is being answerd. He is trying to evade the answer. ఇక్కడ అడిగినటువంటిప్రశ్న చాల clear-cut గా వున్నది. సమాధానం చెప్పకుండా evade చెయ్యడం న్యాయంకాదు, ధర్మంకాదు. ఏమి కారణాలవల్ల తీసి వేశారో చెప్పండి.

The Hon Sri P. Thimma Reddi — ప్రతిపక్షనాయకులుగారు వుప న్యాసంచెబితే చెప్పలేను. కారణాలు లేక కాదు. Disciplinary rules క్రింద తీసివేయ బడినాడు. ఆ విషయాలు చెప్పడం discipline కు భంగకరం అని చెప్పడంలేదు.

Sri T Nagi Reddi — ఇందులో ఒక policy involve అయినది, దీనిని evade చేస్తున్నారని ఆరోపిస్తున్నాను. District Federation కు సెక్రటరీ అన్నకారణంచేత జిల్లాబోర్డు ప్రెసిడెంటు వేమారెడ్డిగారు తీసేశారు, యిది తప్పు అని అంటున్నాం. అది తప్పు అని ప్రభుత్వంకూడా చెప్పించి. కాబట్టి clear-cut answer చెప్పండి. R. హనుమంతప్పగారిని తీయడానికి కారణాలు చెప్పదలచుకో లేనండి, లేకపోతే కారణాలు చెప్పండి.

The Hon. Sri P. Thimma Reddi :— Reasons కావలసినన్ని వున్నాయి. ఇతనికి charge-sheet యిచ్చినతరువాతకూడా జవాబు చెప్పలేదు. వారు జవాబు చెప్పకుండా డివిజినలు యినస్పెక్టరుకు అపీలుచేయగా reject చేసినతరువాత division appeal కు పెట్టే అవకాశంవున్నది.

Sri T. Nagi-Reddi :— ఇది చాల ప్రధానమైనసమస్య అని మొదటే చెప్పారు. నాకు తెలుసును యిటువంటి answer వస్తుందని. అపీలుపెట్టలేదన్నది reason కాదు. నాకు తెలుసు దానికి జవాబుకుంపించిన సంగతి. ఆ జవాబు కాపీ నాదగ్గరకూడా

వున్నది. అయినా House లో సమాధానం రావాలని సప్లమెంటరీ question వేస్తున్నాను. సమాధానం చెప్పమనండి evade చేయడం మంచిదికాదు.

The Hon. Sri P Thimma Reddi — చార్జిషీటుకు యిచ్చిన జవాబులోనే charges కూడా వుంటాయి. జవాబులు మీదగ్గరవుంటే చూపండి చెబుతాను.

Sri T. Nagi Reddi — నాకు అర్ధగంట చర్చకు అవకాశంయిస్తే చెబుతాను.

Deputy Speaker :— Why half-hour debate ?

Sri T Nagi Reddi ·— నేను మంత్రిగావుంటే తప్పకుండా సరైన ఆన్సరు యిచ్చేవాడను. మేము అడిగిన ప్రశ్నయేమిటి, వారు యిచ్చేసమాధానం యేమిటి. కారణాలున్నాయంటారు. చెప్పడానికి అభ్యంతరం ఏమిటి ?

The Hon Tpi P Thimma Reddi — దీనికి కావలసిన information లేక కాదు. జవాబుచెప్పనిది. Discipline కు భంగకరం కాబట్టి చెప్పలేదు. విచారణచేసి charge-sheet పెట్టినతరువాత జవాబు యివ్వకుండా అప్పీలుపెట్టారు. అపీలు reject చేయబడినతరువాత division కు అవకాశం వున్నప్పటికీ ప్రశ్న వేయడం సబబుకాదు అని నావుద్దేశము. అందుచేత వివరాలు చెప్పలేదు. వివరాలులేక కాదు.

Sri T Nagi Reddi — వివరాలు నాకుకూడా తెలుసును. కాని floor మీదకు యీవిషయం తీసుకురావడానికి యీ ప్రశ్న అడుగుతున్నాను. ఇది చాల ప్రధానమైన సంగతి. రాజకీయాలలో పాల్గొంటున్నాడన్న కారణంచేత తమకు యిష్టంలేని వాళ్లను తీసివేయడం అనేపద్ధతి ప్రారంభించబడింది. సాయంత్రం అర్ధగంట డిబేటకు అవకాశంయిస్తే పూర్తిగా చర్చించడానికి వీలువుంటుందని మిమ్ములను ప్రార్థిస్తున్నాను. జవాబుచెప్పించలేరని మీమీద ఆరోపణకు అవకాశం యివ్వవద్దని మనవిచేస్తున్నాను.

Sri K. V. Vema Reddi :— I was the then President, District Board and I am responsible for the removal of this Hanumantha Rao. He was removed not because he was the Secretary of the District Federation, but because there were several charges of of dereliction of duty, charges of disobedience and so on and those charges were inquired into in a most impartial manner and he was removed from service. So he was removed not because he was the Secretary of the District Federation. I do not know why my learned friend, Sri Nagi Reddi is keen about the removal of one teacher. Perhaps he thinks it is because he was associated with the District Federation that he was removed. May I tell him once again there are so many charges and they are so grave from the administrative point of view that they cannot be divulged.

Sri K. Varadachari.—No appeal can be made to the Chair to compel any Minister to say more than what he chooses to say, and it is absolutely very wrong for any member to indent upon the help of the Chair to force a Minister to say what he cannot say or what he does not wish to say.

Sri K. Rajagopala Rao — కొంచం ఉద్రేకంలోనుంచి మామూలు వ్యవహారాలలోకి వద్దాము తమకు ఒకమనవి చేస్తున్నాను. ఉద్రేకంలోనుంచి సరియైన proceedings కు వస్తే మంచిది.

Deputy Speaker — What is your point?

Sri K. Rajagopala Rao — I am coming to the point, Sir! Disciplinary rules అనే కారణంచూపించి జవాబుచెప్పక పోవడం principles కే భంగం మంత్రిగారు జవాబుచెప్పవలసి యుంటుందండి.

Deputy Speaker — It is no point of order ఇతరప్రశ్నలకు సమాధానం చెప్పమని కోరుతున్నాను.

## DECLARATION OF KURNOOL AS A POLICE DISTRICT

*692 Q:—Sri S. Vemiah:—Will the Hon'ble the Deputy Chief Minister be pleased to state:

*(a)* whether Kurnool is declared as Police District?

*(d)* if so, when?

The Hon. Sri N. Sanjeeva Reddi:—

*(a)* Yes, Sir, Kurnool has been bifurcated into Kurnool Urban with Kurnool town and its adjoining areas in Kurnool taluk and Kurnool Rural comprising the rest of Kurnool District for the purpose of police administration.

*(b)* Fifteenth February, 1954.

## SELECTION OF BADVEL TALUK AS A BLOCK UNDER NATIONAL EXTENSION SERVICE SCHEME

*693 Q:—Sri V. Chidanandam:—Will the Hon. the Minister for Planning and Public Health be pleased to state whether the Government have received my letter requesting them to select Badvel taluk as one block under National Extension Service Scheme and if so, the action taken thereon?

The Hon. Sri. D. Sanjivayya :—

Yes. As the Government have already selected the blocks under the National Extension Service Scheme, no action was taken on the letter. The area will, however, be considered for selection when the next set of blocks is alloted for next year.

## FRUIT NURSERY AT KODUR

*694 Q :— Sri P. Narasimha Reddi.— Will the Hon. the Minister for Local Administration and Agriculture be pleased to state :

(a) the money spent by the Government on the Fruit Nursery at Kodur in the years 1950-51, 1951-52, 1952-53, and 1953-54 ;

(b) the income obtained in each of the above years by selling plants ;

(c) whether any plants are exported to other states and over seas ; and

(d) Whether the Nursery is of benefit to the people ?

The Hon. Sri P. Thimma Reddi :—

| | | | |
|---|---|---|---|
| (a) | 1950–51 | | Rs. 7,002—0—0 |
| | 1951–52 | | Rs. 8,288—0—0 |
| | 1952–53 | | Rs. 10,000—0—0 |
| | 1953–54 | | Rs. 13,006—0—0 |
| (b) | 1950–51 | ... | Rs. 5,158—0—0 |
| | 1951–52 | ... | Rs. 10,710—0—0 |
| | 1952–53 | . | Rs. 19,524—0—0 |
| | 1953–54 | ... | Rs. 11,919—0—0 |

(c) The answer is in the affirmative.

(d) Yes.

కోడూరులోని fruit nursery పై గవర్నమెంటు

| | | |
|---|---|---|
| (a) | 1950-51 లో | రూ. 7,002-0-0 |
| | 1951-52 లో | రూ. 8,288-0-0 |
| | 1952-53 లో | రూ. 10,000-0-0 |
| | 1953-54 లో | రూ. 13,006-0-0 |

ఖర్చు చేసినది.

No, IV—4

(b) అక్కడ తయారైన మొక్కలు అమ్మినందువల్ల

| | |
|---|---|
| 1950-51 లో | రూ. 5,158-0-0 |
| 1951-52 లో | రూ. 10,710-0-0 |
| 1952-53 లో | రూ. 19,524-0-0 |
| 1953-54 లో | రూ. 11,919-0-0 |

వసూలు చేయబడినది.

(c) అవును.

(d) అక్కడ తయారైన మొక్కలు విదేశాలకు పంపితే దానివల్ల ప్రజలకు లాభం కావలసినంత ఉన్నది.

## LADIES AS REGIONAL TRANSPORT OFFICERS IN THE STATE

*695 Q:—Srimathi T. Kotamma Reddi:—Will the Hon. the Deputy Chief Minister be pleased to state:

*(a)* the number of ladies appointed as Regional Transport Officers in this State; and

*(b)* if not, why?

The Hon. Sri N. Sanjeeva Reddi:—

*(a)* No ladies have been appointed as Regional Transport Officers.

*(a)* No ladies have applied for appointment as Regional Transport Officers.

## HARIJAN WELFARE FUND

*696 Q:—Sri G. Rama Rao:—Will the Hon. the Minister for Planning and Public Health be pleased to state the amount contributed by the Central Government towards the Harijan Welfare Fund and how the Government are planning to spend it over Harijan Welfare?

The Hon. Sri D. Sanjivayya:—

As no contribution has been received from the Government of India towards Harijan Welfare Fund, the question of spending it does not arise.

29th May 1954]

## COMPLAINTS AGAINST THE INCREASE OF PROFESSION TAX IN VENKATAGIRI TOWN

*697 Q:— Sri D. Seetharamiah:— Will the Hon. the Minister for Local Administration and Agriculture be pleased to state

(a) whether the Government have received any petition from the Rate-payers' Association or the public of Venkatagiri Town in January, 1954 complaining against the increase of profession-tax to twenty five times by the Executive Officer of the local Panchayat Board, and

(b) if so, the action taken thereon?

The Hon. Sri P. Thimma Reddi:—

(a) Yes, Sir.

(b) The Inspector of Municipal Councils and Local Boards has been instructed to cancel the demand notices issued by the Executive Officer in regard to the illegal assessments and to take necessary action in the matter.

(a) అవును.

(b) Executive officer గారు ఇచ్చిన demand notices cancel చేయుమని Local Boards Inspector గారికి ఉత్తరువులు పంపడమయినది.

## DIGGING OF A CHANNEL FROM BANDAR TO VIJAYAVADA

*698 Q:—Sri S. VEMIAH.—Will the Hon. the Deputy Chief Minister be pleased to state whether there are proposals with the Government to dig a channel from Bandar to Vijayawada for navigational purposes?

The Hon. Sri N. Sanjeeva Reddi:—

The answer is in the negative.

## PUBLIC LATRINES IN VILLAGES FOR LADIES

*699 Q:—Srimathi T. Kotamma Reddi:—Will the Hon. the Minister for Planning and Public Health be pleased to state:—

(a) whether there is any proposal before the Government to give instructions to all Panchayats to provide Public latrines in villages for the ladies; and

(b) If not, why?

The Hon. Sri D. Sanjivayya —

(a) The answer is in the negative.

(b) According to Section 50 (e) of the Madras Village Panchayat Act, 1950, it is the primary responsibility of the Panchayat Boards concerned to provide such latrines for the use of the public in their areas.

## PROVINCIAL SUGARCANE ADVISORY COMMITTEE

*700 Q;—Sri K. Govinda Rao:— Will the Hon. the Minister for Local Administration and Agriculture be pleased to state·

(a) whether the Government have a proposal to constitute a Provincial Sugarcane Advisory Committee in our State; and

(b) if so, when?

The Hon. Sri P. Thimma Reddi.—

A Sugarcane Advisory Committee for this State was constituted on 30-3-1954.

Deputy Speaker.— ఈ ప్రశ్న రేపు తీసుకుందాము.

Sri K. Govinda Rao — నా ప్రశ్నకు సమాధానం సరిగా చెప్పలేదు. నన్ను పిలవలేదు.

Deputy Speaker — ఒక పర్యాయం Opposition leader గారితో చెప్పాను. Certain question ఉన్నది, time allow చెయ్యండి అంటే చేస్తామని చెప్పితే ఆ సాంప్రదాయాలు పాటించరు, గల్లంతు పెడతారు.

Sri T. Nagi Reddi.— Important question వచ్చినప్పుడు టైము ఇవ్వమని అడిగారు. ఇంతకుముందు ఈ విషయాన్ని గురించి చెప్పమంటే చెప్పాను.

నేనొక personal submission చేయాలి. వేమారెడ్డిగారు చెప్పినతరువాత నేను చెప్పకపోతే ఒక wrong attitude తో records లోకి ఎక్కుతుంది. వేమారెడ్డిగారు ఏవో కారణాలు చెబుతారనుకొన్నాను. వారు చెప్పినవి insinuations కాని కారణాలు కావు. ఏవో కట్టలుకట్టలుగా charges ఉన్నాయని ఆ ఛార్జీలు పరిశీలించి చర్య తీసుకుంటామని చెప్పారు. తరువాత పరిశీలించి చర్య తీసుకున్నామని చెబుతున్నారు. నేను విజ్ఞప్తి చేసేది అర్ధగంట debate allow చేస్తే చాలామంచిది అని ప్రభుత్వం చాలా ప్రమాదకరమైన పరిస్థితిలో పడుతోంది. కనుక అర్ధగంట debate allow చేస్తేగాని కారణాలు చెప్పించుటకు వీలు ఉండదు. Speakers' conference లో ఒకనిర్ణయం జరిగింది. ఒక ప్రశ్న

Floor మీద వచ్చినప్పుడు తగుమైన సమాధానం ఇవ్వాలిగాని త్రోసివేసే సమాధానం ఇవ్వకూడదు. ఈ ప్రశ్నపంపి కొన్ని నెలలు ఐనది. సమాధానం చెప్పకపోతే ప్రశ్న వేయడం ఎందుకు. Floor మీదికి వచ్చి reasons చెప్పను అంటే House ను కించపరచడమని అభిప్రాయపడుతున్నాను. తీసివేయడం సక్రమంకాదని చర్చకు అర్ధగంట time ఇవ్వాలని కోరుతూ తీసివేయడంలో political motives ఉన్నవనిచెబుతున్నాను.

Deputy Speaker — అది రోజు వారీ administration కు సంబంధించిన ప్రశ్న. వారు administrative గా విచారణజరిపి తీసివేశామని చెబుతున్నారు.

The Hon Sri N Sanjeeva Reddi — గవర్నమెంటు తీసివేయలేదు అవి జిల్లాబోర్డు ఉన్నరోజులు. అప్పుడు వారు routine administration లో విచారించి ఏవో charges prove ఐతే తీసివేశామని చెబుతున్నారు. పార్టీకి సంబంధించనవాడు కాబట్టి ఏదో indiscipline కారణాలచేత తీసివేశాము. అర్ధగంట debate వల్ల ఇందలి న్యాయాన్యాయాలు చర్చించుటకు వీలు ఉంటుందని అధ్యక్షులవారికి తెలిసియుంటుంది.

Sri Pillalamarri Venkateswarlu — ఒక విషయంమాత్రం చెపుతూ ఉన్నాము. High Court తీర్పుకూడ ఉంది. టీచర్సుఅసోసియేషన్ కార్యవర్గములో ఉన్నవారిని తీసివేయకూడదని అందులో ఉంది. జిల్లాబోర్డు గవర్నమెంటు సంస్థగ ఉన్నపుడు ప్రెసిడెంటు నిరంకుశంగా ప్రవర్తించడానికి అవకాశం ఉంది అని సంజీవరెడ్డిగారు చెపుతూ ఉన్నారు. మీ దగ్గర ఉండే చార్జీలు అన్నీ విపులంగాచెప్పే అవకాశం వచ్చింది. ఆ విషయాలు House లోకి వచ్చినందున వదలివేయకూడదు. ఈ విషయంలో స్పీకరు మవులంకరు కూడా సమాధానం ఇచ్చి ఉన్నారు. ½ గంట debate కు అవకాశం ఇస్తే ఈ విషయం తేలుతుంది.

Deputy Speaker — ఇది Speakers' conference లో చర్చ జరిగింది. సమాధానముచెప్పవలసిన అగత్యం ఉంది అని T Nagi Reddi గారు చెప్పారు. ఈ ప్రశ్నకు సమాధానం ఇచ్చేవిషయంలో గవర్నమెంటుఎంతవరకు responsible. స్పీకరుగారితో సంప్రతించి తరువాత నిర్ణయిద్దాం.

Sri K. Malakondayya :— Point of information, Sir.

Deputy Speaker :— ముందు ముగించిన విషయంమీదనా? లేక రాబోయే విషయంమీదనా?

Sri K. Malakondayya :— రాబోయే విషయంమీద.

Deputy Speaker — పాయింటు వచ్చినపుడు అడుగవచ్చును. ఇపుడు recruitment to public services కు సంబంధించిన పేపరు, టేబిల్ మీద ఉంది.

Sri V. Gopalakrishnaiah :— Formal గా పెట్టారు అనుకొంటాను. దానిమీద discussion ప్రత్యేకమైన పెట్టుతారా అని అడుగుతున్నాను.

[29th May 1954

Sri K Rajagopala Rao — Recruitment to public services చాలా ముఖ్యమైనవిషయం. ప్రభుత్వపాలసీకి సంబంధిచిన సమస్య కాబట్టి ½ గంట చర్చకు అవకాశం కలుగ జేయవలెను.

Deputy Speaker — Opposition లీడరుతోను, concerned Minister తోను మాట్లాడి చెప్పతాను

Sri K Malakondayya — Questions కు సరియైన సమాధానములు రాకపోవడం, supplemental questions కు అవకాశం ఇవ్వకపోవడం వల్ల చాలా ఇబ్బంది కలుగుతున్నది. దీనినిగురించి స్పీకరుగారు రూలింగు ఇవ్వవలెనని కోరుతున్నాను.

Deputy Speaker — ఇది ఆఫీసులో తెలిసికొనవలసిన విషయం.

ఇప్పుడు Table మీద ఒక adjournment motion ఉంది. Sri G. C. Kondayya will read the motion.

## II. ADJOURNMENT MOTION

### RE: FORCIBLE COLLECTION OF LOANS FROM RYOTS

Sri G. C. Kondayya :— I move :

This House stands adjourned to discuss a matter of urgent public importance, namely, the Government's carelessness to implement its own decision published in April 1954, of postponing the collection of all sorts of Government loans, in all the dry taluks and zamindari areas of the Province. Since the decision of the Government is not at all instructed correctly and strictly to the Revenue Officials in Nellore district and elsewhere in the Province, the local officials are harrassing the ryots by forcible collection of loans which is causing unwarranted anxiety and agitation among the villages.

Deputy Speaker :— ఇది Day to day administration కు సంబంధించిన విషయము. adjourn చేయుటకు అవసరం కనబడలేదు. అందువల్ల దీనిని allow చేయడంలేదు. తరువాత కార్యక్రమం యూనివర్శిటీ బిల్లుమీద చర్చ.

Sri A. Venkataramaraju: —Point of order, Sir, మొన్న adjournment motion ఒకటి ఇచ్చాను. అది ఇపుడు రాలేదు. అది ఏమైందో తెలియజేస్తారా?

Deputy Speaker :— adjournment motion ఉంటే చేంబర్సులో స్పీకరుగారికి ఇవ్వవలెను. కాని స్పీకరుగారికి ఇచ్చేటట్లు చూడండి.

# III. GOVERNMENT BILLS
# SRI VENKATESWARA UNIVERSITY BILL, 1954.

29th May 1954]

Sri C. Pulla Reddi.— University బిల్లు విషయంలో మీకు 56 amendments వచ్చాయి. ఒక్కొక్క క్లాసు ఒకచోట ఉంటేతప్ప, క్లాసు పడిపోతుందా అని సమగ్రంగా చూడడానికి వీలుగా ఉండదు, మధ్యాహ్నమైనా consolidate చేసి మాకు అందించవలెనని కోరుతూ ఉన్నాను

Sri C V K Rao — చర్చకు ఎంతకాలం ఉంటుందో తెలియచేస్తారా ?

The Hon Sri N. Sanjeeva Reddi :— మొదటిరోజునే ముగిద్దామని అనుకున్నాం. Speakers ఎక్కువగావున్నందున జరుగలేదు. ఈ దినం కూడ general discussion పెట్టుకుంటే మన కార్యక్రమం ముగించుకోవటం కష్టం. కాబట్టి speakers యొక్క సంఖ్య తగ్గించుకుంటే, కార్యక్రమం యీ రోజు పూర్తిచేయటానికి వీలు అవుతుంది.

Deputy Speaker : — Speakersయొక్క సంఖ్య తగ్గించుకునే ఏర్పాటు చేస్తే బాగుంటుంది

The Hon. Sri N Sanjeeva Reddi ·— అవసరమైతే మధ్యాహ్నం కూడ కూర్చుంటే మంచిది. 3½ గంటలనుండి 6 గంటలవరకు పెట్టడానికి అందరికీ అనుకూలంగావుంటుంది. ఆ ప్రకారం చేసుకుందాము. ఈ House కార్యక్రమానికి యిబ్బంది కలుగకుండావుంటే బాగుంటుంది.

Sri N. V. Rama Rao —మధ్యాహ్నంకూడ యీ బిల్లును చర్చించి close చేస్తే మంచిది.

Sri V Gopalakrishnaiah — కార్యక్రమం, మారిస్తే చాలా చిక్కు వస్తుందండి. మాచ్ ఖండ్ వెళ్లటానికి యిబ్బంది అవుతుంది. మళ్లా ఆదివారం తిరిగిరావటానికి వీలుండదు అందువల్ల, మధ్యాహ్నం సమావేశం ఏర్పాటుచేయవద్దని కోరుతున్నాను.

The Hon. Sri N. Sanjeeva Reddi :— సాయంత్రమే ఇక్కడ బైలు దేరండి. రాత్రి 10 గంటలకు, మాచ్ ఖండ్ చేరుకుంటారు. రాత్రి అక్కడ పడుకోండి. మరునాడు మాచ్ ఖండ్ చూడవచ్చును. మధ్యాహ్నం బైలుదేరే బదులు సాయంకాలం బైలు దేరుతారు. కొంచెం ఆలస్యంగా అక్కడికి చేరుకుంటారు.

Deputy Speaker :— శాసనసభ్యులు ఇక్కడికి రావటము శాసనసభా కార్యక్రమాలను పూర్తిచేయటానికే.

Sri Vavilala Gopalakrishnaiah :— మాచ్ ఖండ్ వెళ్లి చూచిరావటానికి శాసనసభ ఒప్పుకుంది. ఆప్రకారమే ఇదివరకు శాసనసభ్యులు వెళ్లి రావటం జరిగింది.

Deputy Speaker :— సభ్యులు ఒప్పుకొనివుండవచ్చును. శాసనసభ ఒప్పుకోలేదు.

Sri V Gopalakrishnaiah – శాసనసభ ఒప్పుకున్నదండీ.

Sri G Latchanna — ప్రభుత్వసూచనమీద జరుగుతున్నది గాబట్టి ఆ ప్రకారం చేయించండి.

Deputy Speaker — ఏమండీ, లచ్చన్నగారూ? మీరుగూడ Party Leader కాబట్టి యీరోజున యిది ముగిద్దామా?

Sri G Latchanna .— తరువాత మరొకరోజు పెట్టుకుందామని శాసనసభానాయకులు Speaker గారి గదిలో చెప్పారు. ఇది చాలా ప్రధానమైన సమస్య. విద్యావిధానమునకు సంబంధించినది. కొంచెము వ్యవధి యివ్వవలెనని కోరుతున్నాను. ఐనా మిగతా నాయకులతోగూడ సంప్రదించి ఆ ప్రకారం చేయండి

Deputy Speaker — ఏమండీ నాగిరెడ్డిగారు మీరు ఏమిచెబుతారు?

Sri T. Nagi Reddi .— నేను సంజీవరెడ్డిగారి సూచనతో ఏకీభవిస్తున్నాను. సాయంత్రంగూడ కూర్చుంటే మంచిదే. ఆలోగా ముగించటానికి ప్రయత్నిస్తాము మధ్యాహ్నంగూడ కూర్చుని వీలయినంతవరకు యీ దినమే పూర్తిచేయటానికి ప్రయత్నం చేయవచ్చును. ఒకటి, రెండు క్లాజులు మిగిలితే తరువాతరోజున పూర్తిచేయటానికి ప్రయత్నించవచ్చును. కాబట్టి 3½ గంటలనుండి సాయంత్రం 6 గంటలదాకా కూర్చోడానికి అభ్యంతరం లేదు. మధ్యాహ్నం కూర్చోవచ్చును. ఈ దినమే ఈ Bill ను పూర్తిచేయటానికి ప్రయత్నంచేస్తాం. మిగిలినవి ఏమైనావుంటే తరువాతరోజు చూడవచ్చును.

Deputy Speaker — దీని ననుసరించి మాట్లాడేవారి list యివ్వండి.

Sri Vavilala Gopalakrishnaiah — ఉపాధ్యక్షా! నామనవి ఆలోచించారా?

Deputy Speaker — ఆలోచిస్తున్నాను.

Sri Vavilala Gopalakrishnaiah :— ఈ arrangements వల్ల ఎంత యిబ్బందివస్తుందో ఆలోచించారా? ముందే Education Minister గారిని అడిగాను. ఆతరువాత మాచ్ ఖండ్ వెళ్లటానికి ఏర్పాటుచేసుకున్నాం. అందువల్ల మధ్యాహ్నపు ప్రోగ్రాం మార్చమని కోరుతున్నాను.

Deputy Speaker :— అసలు ఇవ్వాళ మీరు మాట్లాడుతారా? అయితే ముందు మీరు మాట్లాడండి.

Sri Vavilala Gopalakrishnaiah :— లోగడ మాచ్ ఖండ్ కు వెళ్లే వారికోసం రెండురోజులు వాయిదావేశారు. అట్లాగే యిప్పుడుగూడ మరొకరోజుకు extend చేయమని కోరుతున్నాను.

The Hon Sri T Viswanadham - మాచ్‌ఖండ్‌కు వెళ్ళేవాళ్ళకోసం ఎప్పుడు నిలిపివేయలేదండి.

Deputy Speaker — మాట్లాడదలచుకున్న వారికి ఒంటిగంటలోపుగా అవకాశం యిస్తాము మాట్లాడవచ్చు.

Sri K. Venkaiah దీనిమీద ఓటింగుమాత్రం ఎల్లుండి సోమవారం వస్తే మంచిది

The Hon. Sri N. Sanjeeva Reddi — మాచ్‌ఖండ్‌కు వెళ్లదలచుకునేవారు 6 గంటల తరువాత వెళ్లండి. ఒంటిగంటకు వెళ్లేబదులు 6 గంటల తరువాత బైలుదేరితే రాత్రి 10 గంటలకు అక్కడికి చేరుకుంటారు. ఆ రాత్రి అక్కడ పడుకొని మరునాడు చూడండి.

Deputy Speaker — విజయనగరం రాజాగారూ ! మీరు ఏమిచెబుతారు ?

Sri P. V. R. Gajapathi Raju :— People who go to Machkand cannot see anything in the night; they may leave at 6 in the evening or at 10 in the night. They can see the place only tomorrow and we can take up this business today. That is my opinion.

Deputy Speaker — అందువల్ల ఇవ్వాళ దీనిని take up చేసి సాయంత్రం గూడ తీసుకుందాం.

Sri C. Pulla Reddi — నా సబ్‌మిషన్ యీ ప్రయాణాలమధ్య అడుగునపడిపోదా ?

Deputy Speaker :— అది అంతా నిర్ధారణ అయింది.

Sri C. Pulla Reddi — ఈ బిల్లుమీద amendments ఒక్కొక్కటి ఒక్కొక్కరోజున మాకు supply చేశారు. ఇట్లావుంటే వీట్లమీద ఆలోచించి ఒక opinion కు రావటం కష్టంగావుంటుంది. ఈ amendments చాలామంది సభ్యులు యిచ్చారు. అందులో ఏ amendments మంచివో చూచుకోడానికి వీలుపడటం లేదు. కాబట్టి వీటినన్నింటిని consolidate చేసి ఒక form లో పెట్టించి అందచేయాలని కోరుతున్నాను.

Deputy Speaker — ఇప్పుడు, ఆవిధంగా చేయటానికి time చాలదు.

The Hon. Sri N. Sanjeeva Reddi :— ఇప్పుడు ఈ స్వల్పవ్యవధిలో అవి అన్నీ క్రోడీకరించి చేయాలంటే సాధ్యమయ్యేపనిగాదు. సాయంత్రంలోగా ప్రయత్నం చేద్దామన్నా కాదు.

Deputy Speaker :— ఇది వెంటనేజరిగే విషయంకాదు. ఇక బిల్లు చర్చలోకి వెళ్దాము.

Sri K Adikesavalu Naidu — మన ముందువున్న యీ Venkateswara University Bill పైన Select Committee Report పరిశీలించటములో నేను ప్రత్యేకంగా ఒకసంగతి చెప్పదలచుకున్నాను. ఈ Select Committee Report లో ఛైరమన్‌గారి కాస్టింగ్ ఓటుతో pass అయినట్లుగా కనిపిస్తున్నది ఇందులో 'లోక్' సభ వారి అభిప్రాయం తీసుకుంటే అక్కడి Speaker గారి ruling వల్ల ఏ Select Committee లోనైనాగాని concerned Minister దానికి Chairman గా వుండ కూడదని వుంది. ఆప్రకారం మనంకూడ పాటించితే చాలా సహాయకారిగా వుంటుంది.

అవిధంగా విద్యాశాఖ మంత్రిగారు ఈ Select Committee కి Chairman గా లేకుండా ఉంటే, ఈ Select Committee, report ఏవిధంగా ఉండేదో ఊహించుకో వచ్చు. దీనిలో ముఖ్యంగా నాగిరెడ్డిగారు, తదితరులు ఒక dissenting minute ఇచ్చారు. ఆ dissenting minute లో వారు "ఆంధ్రదేశములోని ఈ నాటి పరిస్థితులలో" అని మొదలుపెట్టారు. Conclusion లో మాత్రము "కనుక ఆ కళాశాలలను ఆంధ్ర విశ్వ విద్యాలయమునకు అనుబంధించి తిరుపతిలో" విశ్వవిద్యాలయానికి పునాదులు వేయుట తక్షణ కర్తవ్యమైయున్నదని మా అభిప్రాయమని చెప్పారు. దాన్నిబట్టి వారు వెంటనే అక్కడ Residential University గాని, Affiliating University గాని స్థాపించడం అసాధ్యం అని, అందుకని ఇప్పుడు అక్కడ ఒక University centre మాత్రమే స్థాపించి దాన్ని 3, 4 సంవత్సరాలలో అభివృద్ధికి తీసుకొనివచ్చినతరువాత Affiliating University గా గాని, లేక Residential University గా గాని మారిస్తే బాగుంటుందనే ఉద్దేశ్యం పెట్టుకొన్నట్లున్నది. కాని ఇప్పుడు అసెంబ్లీలో వాళ్లు వ్యక్తపరచిన అభిప్రాయాన్నిబట్టి అక్కడ Residential University పెట్టుకొనేదానికి సంపూర్ణంగా సహకరిస్తాము, Affiliating University మాత్రం పెట్టడానికి వీలులేదని చెప్పుతున్నారు. వాళ్లు dissenting minute లో ఆ విధంగా సూచించి అది మా ఖచ్చితమైన అభిప్రాయమని చెప్పి, ఇక్కడమాత్రము Residential University వెంటనేస్థాపించాలని అనడంలో వాళ్లు ఈ విషయంలో ఏమి భావిస్తున్నారో అర్థంకావడంలేదు. దాన్నిబట్టి ఈ నాటి పరిస్థితులనుబట్టి ఉన్న అవకాశాలను ఉపయోగించుకొని ఆ విధంగా నడుచుకొనేటటువంటి వాళ్లని నేను భావిస్తున్నాను. నాగిరెడ్డిగారు Affiliating University కిని, Residential University కిని భేదాలు వ్యక్తపరస్తూ తన అభిప్రాయాన్ని lawyer గా చెప్పారు. Affiliating University పనికిరాదు. Residential University అక్కడపెట్టాలని అంటున్నారు. దానిలో ముఖ్యంగా ఈ తిరుపతిలో ఇప్పుడున్న కాలేజీలపరిస్థితి ఏమిటి అనేసంగతి మీ గుర్తుకు తెస్తున్నాను. ఈ రోజు అక్కడ ఒక First Grade College, ఒక Second Grade College (Women's College) ఈ రెండు మాత్రము ఉన్నవి. ఆ రెండిటితో మొదలుపెట్టి దాన్ని ఒక University గా ప్రారంభించాలని అభిప్రాయపడుతున్నారు. అక్కడ University ప్రారంభించడంతో Second Grade కా

శాలలను రెండిటిని మాత్రము Andhra University అధికారంలోలేకుండా వేరు చేసి దేవస్థానం అధికారంలో పెట్టాలని సూచించినారు. ఈ రెండు Second Grade కళాశాలలను చేర్చి ఈ నాడు అనుబంధ విశ్వవిద్యాలయంచేసినా, లేక Residential విశ్వ విద్యాలయంచేసినా ఆ కాలేజీలను వేరుగా ఏర్పాటుచేయవలసియుంటుంది. వాటికిగాను ఈ రోజు వేరుగా science courses కూడ ఉన్నాయి. కాబట్టి వాటికి separate laboratory equipment ఈ రోజు దేవస్థానంవారు ఏర్పాటుచేయవలసియుంటుంది. మనం University Commission వాళ్ల report చూశామంటే, ఆ report ప్రకారం Degree Courses మూడేళ్లుచేసి, Intermediate Courses పూర్తిగా లేకుండానే చేసే ఉద్దేశాన్ని సూచించారు. దానిని మన expert educationists కూడ అంగీకరించారు. మనవాళ్లు అంగీకరించారు. Secondary Education Commission వాళ్లు కూడ దీనిని అంగీకరించారు. ఈ పరిస్థితులలో ఈ రెండు Secondary grade Colleges కు దేవస్థానంవాళ్లు వ్యయపరచి separate laboratory ని నిర్మించాలని అనడంలో ఆ డబ్బు వృథా అవుతుంది. ఈ laboratory ని ఎందుకుగాను ఉపయోగించ బోతున్నారనేది, యోచించవలసిందని మీద్వారా ప్రభుత్వానికి మనవిచేస్తున్నాను.

"It is not possible to disown responsibility for these students since Sri Venkateswara College has been satisfying the local need. Also any new University that starts may be required to conform to the University Commission's proposal to have a three-year Degree course without the Intermediate Course. This proposal to have a three-year Degree course has also been endorsed by the Secondary Education Commission and recently by the Central Advisory Board of Education. It is therefore necessary to make an interim arrangement for the Intermediate students without bringing them into the University. An additional complication at Tirupati is that the Devasthanam has started a separate Women's Intermediate College. This is institution No. 2 in the list above. The only alternative is for Government to assume responsibility for these two Intermediate Colleges during the period that may be necessary to run them. Any equipment that is provided for these institutions can be transferred later to other Government institutions or aided institutions in lieu of equipment and furniture grant. There will be plenty of time for the new University to decide the future of these two Intermediate Colleges".

అందుకని ఈ Intermediate Colleges ను కూడ యిప్పుడు స్థాపించబోయే Affilating University కానివ్వండి, Residential University కానివ్వండి, అందులో చేర్చవచ్చును. ఇప్పుడు వెంటనే వేరే యూనివర్సిటీ ఎందుకు ఉండాలి, అని కొందరు

[Sri K. Adikesavalu Naidu] [29th May 1954

అంటున్నారు కొందరు మిత్రులు ఇక్కడవచ్చి ఈ Waltair University లో ఉండే కళాశాలల buildings, ఇక్కడ ఉండేటటువంటి ఈ స్థలము ఇవన్నీ చూచినతరువాత ఎందుకుగాను ప్రత్యేకంగా ఒక ప్రాంతానికి ఒక University ఏర్పాటుచేసి, ఆ ప్రాంతం వాళ్లకు ఇక్కడ ఉండే University హక్కులను ఎందుకు పోగొట్టుకోవాలనే అభిప్రాయం చాలా ప్రబలంగా ఉంటున్నసంగతి ఎవరు మరచిపోకూడదని మనవిచేస్తున్నాను. నిన్న రామయ్యచౌదరిగారు మాట్లాడినదాన్నిగురించి నేను కటువుగా మాట్లాడదలచుకొన్నాను. వారు నిన్నటి ఉపన్యాసంలో మాట్లాడుతూ, మేము అక్కడ తిరుపతికి ఎందుకు పోవాలి, అక్కడక్షౌరముతప్పితే మరేమిలేదని అన్నారు. వారికిమాత్రము ఒకవిషయము చెప్పదలచుకొన్నాను. అక్కడ ఒక క్షౌరమే ఉంటే, అది ఒక Cottage Industry గా ప్రారంభించియుంటారని అనుకోవలసివస్తుంది. అక్కడ క్షౌరము ఒకభాగం కావచ్చు. ఈ రోజు 32 లక్షల రూపాయలు ఆ వెంకటేశ్వరునిగుడికి ఆదాయంవస్తుందని అంటే, ఆ 32 లక్షల రూపాయల ఆదాయానికి ఏది ఆధారమో గుర్తించమంటున్నాను. వారి ఈ ఉద్దేశాన్ని మాత్రము పూర్తిగా వదులుకోమ్మని మనవిచేస్తున్నాను. యాత్రికులకు ఇలాంటి దురభిప్రాయాలు కలుగచేయవద్దని చెప్పుచున్నాను. అక్కడవచ్చే యాత్రికులలో ¾ భాగం ఇతరరాష్ట్రాలనుంచి వస్తున్నారు. వారికి ఈ దేవునిమీద ప్రత్యేకంగా ఉన్నటువంటి భక్తికి ఏలాటి ఆటంకముగాని అపోహగాని కలుగజేసేటట్టుగా ఉద్దేశాలు వెలిబుచ్చవద్దని మనవిచేస్తున్నాను. తిరుపతిలో ఉండే University buildings estimate వేసినా అక్కడదేవస్థానం బిల్డింగ్సు complete చేయుటకు 4 సంవత్సరాలు అవుతుంది. First Grade College complete అయింది, Second Grade College 6 మాసాల్లో complete అవుతుందని అన్నారు. ఆ బిల్డింగుల equipment కొరకు 35 లక్షలరూపాయలు ఖర్చుపెట్టారు. ఈ రోజు 6½ లక్షలరూపాయలు contribution ఇస్తామని చెప్పుతున్నాను. Recurring expenditure కు గాను కనీసం 2½ లక్షల రూపాయలు ఇవ్వాలని బిల్లులో provide చేసియున్నారు. ఆ 2½ లక్షలరూపాయలు ఒక capital interest క్రింద 4 percent తీసుకొన్నామంటే, సుమారు 75 వేలు అవుతుంది. కనుక ఈ డబ్బును వృథాచేయకూడదు. ఇది ఇప్పుడు క్రొత్తగావచ్చింది గాదు. 1925 లో సదాశివయ్యర్ గారు ఒక బిల్లు తయారుచేశారు. అది ఎందువల్లనో ఆ నాడు అమలుకురాలేకుండాపోయింది.

1946 వ సంవత్సరములో యూనివర్సిటీ పెట్టబోతున్నారని ఒకవదంతి బయలుదేరింది. మన కోటిరెడ్డిగారు తిరుపతిలో కొండమీద పెట్టాలా, కొండక్రింద పెట్టాలా అనే దానివిషయంలో ఏ ఒకతీర్మానానికి రాలేకుండాఉండిరి. తిరుపతిలో విశ్వవిద్యాలయంస్థాపించటానికి అడ్డుఏది ఉండదని నేను అనుకున్నాను. కాని ఇప్పుడు ప్రాంతీయ అభిమానాలు, దురభిమానాలు రెచ్చగొట్టుతూ అవి యింకను పెంచాలనే ఆలోచనలు కలిగిస్తున్నారు. ముఖ్యంగా యీ బిల్లులో చేర్చబడిన ప్రకారము కాకుండా రెండేళ్లు పోయినతరువాత Affiliating

University చేస్తామనిన్నీ, యిప్పుడు ఆరంభములోమాత్రం Residential University చేయమనే అభిప్రాయము సభ్యులలో ప్రబలంగావున్నది. ఆవిధంగా చేస్తే యీ రెండేళ్ల లోపల దాన్ని Affiliating University చేయమని చెన్నప్పటికినీ ప్రభుత్వము దానికి తగిన ధనసహాయము చేస్తామనికూడ చెబుతున్నారు. అలాంటప్పుడు ఆవిధంగా ఒకనిర్దిష్టమైన తీర్మానానికి సభ్యులందరు రాగలరని ఆశిస్తున్నాను. ముఖ్యంగా రెండేళ్లవరకు ఈ విశ్వ విద్యాలయము Residential University గా పెట్టినట్లయితే, తిరుపతి, యింకను ప్రక్కనవున్న జిల్లాలవిద్యార్థులకు ప్రధానంగా ఉపయోగపడగలదని అంటున్నాను. ఈ అభిప్రాయముతో నేను ఏకీభవిస్తున్నాను. దీన్ని అమలుపరచవలసిందిగా కోరుతున్నాను. ఆంధ్రరాష్ట్రములో మనకు వాల్తేరులో Premier University ఒకటి వుండనేవున్నది. తిరుపతిలో పెట్టబోయేది Residential గా చేస్తే రాయలసీమవిద్యార్థులకు వాల్తేరు చాలా దూరముగావున్న కారణముచే చాలా యిబ్బందులకు గురి అవుతారు అనేదానికంటే వేరే విధముగా సక్రమమైన విధానాన్ని యోచనచేసి దాన్ని అమలుపరిస్తే బాగుంటుందని నా అభిప్రాయము. రాష్ట్రములో additional expenditure తగిలేదానికంటే Women's Colleges, Men's Colleges అన్ని మార్చివేసి ప్రత్యేకసౌకర్యాలు ఏర్పాటుచేయ కోరుతున్నారు. Women's College లో యీ స్త్రీలమందివుంటే, ఆ యీ స్త్రీలమందికోరకే ఒక College ను ప్రత్యేకంగా ఏర్పాటుచేయడము ఎంతవరకు భావ్యమో గుర్తించాలి. వీలు అయినంతవరకు Women's College అని, Men's College అని భేదములేకుండా ఒకే కాలేజీని ఏర్పాటుచేసి ఖర్చు తగ్గించాలని అంటున్నాను. యూనివర్శిటీ మనకు ఇక్కడ వేరే పెట్టడమునకు తొందర ఎందుకు అని దశరథరామయ్యగారు అన్నారు. అంతేకాకుండా కడపలో ఒక Law College పెట్టండి. మదనపల్లిలో ఒక Medical College పెట్టండి, రాయలసీమవారి కందరికి అనుకూలంగావుంటుందని కూడా చెప్పారు. Tirupati University స్థాపనకుగాను వేసిన కమిటీవారే వారియొక్క expert opinion యిచ్చారు. దశరథరామయ్య గారు చెప్పడములో యూనివర్శిటీ అనంతపురంలో పెట్టితే, దానికి బలంచేకూరుతుందని అన్నారు. ఇది ప్రజాభిప్రాయానికి వ్యతిరేకంగావున్నందున, మెంబర్లు అందరు యీ అభిప్రాయమును తిరస్కరించారు. నేను చెప్పేది యేమిటంటే, ఏ రకమైన యూనివర్శిటీ స్థాపించినప్పటికిని ఏదో మాకుగూడా ఒక University వుంది అని చెప్పుకునేదానికిబదులు రాష్ట్రానికి అంతటికి full fledged University ఒకటైనావుంటే చాలునని అంటున్నాను. అది Residential కానివ్వండి, Affiliating కానివ్వండి. Full fledged గా వుండే యూనివర్శిటీ ఒకటివుంటే చాలు అని నా అభిప్రాయము. దానికి ప్రభుత్వము ధనసహాయముచేయాలి. ఆ విధంగా లేనప్పుడు మనకు యూనివర్శిటీ ఎందుకో నాకు అర్థముకావడములేదు. ఏదోమూలగావున్నటువంటి Waltair లో వున్నదానికి $5\frac{1}{2}$ లక్షలు ఖర్చుచేసేదానికన్న అంతకంటె మంచిదిగా ఒక్కటే Capital University అనేపేరుతో పెట్టితే, అది రాయలసీమవారికి గూడా ఉపయోగిస్తుంది.

ఏదో తిరుపతిదేవస్థానమువారు 20 లక్షలరూపాయలు యిస్తామని అంటున్నారని, మాకు దాన్ని Residential University చేయమని అంటున్నారేగాని, Affiliating University గా చేయమని ఎవరు అనలేదు. కొందరువ్యక్తులు తమ స్వంత అభిప్రాయములో యీ డబ్బుకు యూనివర్సిటీకి మాత్రమే వుపయోగించుకోవాలనే అభిప్రాయము కనబరచడము చాలా విచారకరంగావున్నది. దీనిలో ప్రత్యేకంగా రాయలసీమవారికి లేనిపోని కక్షలు అంటగట్టి, దానిరూపము చెడకుండా ఏదోఒకవిధముగా ఒక నూతనసంస్థ ఏర్పాటుచేయాలి కాబట్టి, ఒకేయూనివర్సిటీ, ఒకేకాలేజి అనిచెప్పి, యింక ఎప్పుడో మిగతాకాలేజీలు అన్ని affiliate చేసి ఒక status కు తీసుకొనివచ్చిపెట్టమని అభిప్రాయమపడడములో అది అంత అసమంజసముగా కనబడలేదు. కాబట్టి ప్రతి కాలేజీని ప్రత్యేకంగా ఒక University గా, చేయడం మంచిదికాదు. ప్రముఖ విద్యావేత్తలు యిచ్చిన అభిప్రాయాలువున్నవి. Administration కు సంబంధించిన యితర అభిప్రాయాలువున్నవి ఈ అభిప్రాయాలన్నియు క్రోడీకరించి ప్రాంతీయ అభిమాన, దురభిమానాలకు అతీతంగావుంచి, యీ యూనివర్సిటీని ప్రారంభదశలోనే శాశ్వతమైన యూనివర్సిటీగా స్థాపించి, ఆ తరువాత Affiliating University గా వుండేటట్లుగాచేస్తే, శ్రీ వెంకటేశ్వరస్వామివారి డబ్బు ఎక్కువ ఉపయోగపడుతుందని నా అభిప్రాయము కాబట్టి దేశవ్యాప్తముగా విద్యార్థులందరికి ఉపయోగపడేటట్లుగా Benares University మాదిరిగా సమగ్రంగా అభివృద్ధిపొందేటట్లుగా ఏర్పాటుచేస్తే మంచిది. లేకపోతే యీ యూనివర్సిటీకి ఉపయోగించబోయేసొమ్ము నిరర్థకమే అవుతుందని నా అభిప్రాయము. ఆంధ్రదేశమునకంతటకును మహోత్తమమైన institution ఒకటి స్థాపించి దాన్ని అభివృద్ధికితేవాలని ఉద్దేశము కనబరిస్తే, ప్రజలందరు దానికి ఎంతో సహాకరించగలరని చెబుతూ యింతటితో విరమిస్తున్నాను.

Sri K. Ramayya Chowdary — On a point of order, Sir. ఈ యూనివర్సిటీవిషయములో రాయలసీమ కాలేజీలకు సంబంధించిన students అందరు ఏ అవాంతరపరిస్థితులలోను అనుకూలంగా లేరని మల్లయ్యగారు refer చేస్తూ చెప్పారు. తిరుపతికాలేజీలకు సంబంధించిన Students' Federation మాత్రం యీ రాబోవు యూనివర్సిటీ Residential University గా కావాలని ఒక resolution పంపించింది. అది వారు నిర్ధారణచేస్తున్నారు. నెల్లూరుకాలేజీలు రెండున్నూ యిప్పటికి ముప్పది సంవత్సరాలుగా వాల్తేరులోవున్న ఆంధ్ర యూనివర్సిటీలోవున్నప్పుడు అభివృద్ధిచెందినవి. యిప్పుడు కొత్తగారాబోయే యూనివర్సిటీలో నెల్లూరుకాలేజీలను చేర్చమని మేము ఎన్నడు అనలేదు. అక్కడవున్న Students Federation resolution పంపించారు అంటేకాని, కొత్తగా ఏర్పరచబోయే యూనివర్సిటీలో చేర్చమని మేము చెప్పలేదనే విషయము మల్లయ్యగారు గుర్తించాలని అంటున్నాను.

Sri K. Ranga Rao :— అధ్యక్షా ! ఈ రోజున యిక్కడ మనం చర్చిస్తున్న [illegible] bill [illegible] క్రొత్తగాయేర్పడిన మహారాష్ట్రంలో మనకు మరొక University

యేర్పరచి విద్యా, విజ్ఞానాభివృద్ధికి దోహదమిచ్చేదని మంత్రిగారు చెప్పారు. కాని దానితోబాటు యీ రకమైన కార్యక్రమము తీసుకొనివచ్చి పెట్టి ఆంధ్రదేశములో శాశ్వతంగా విభేదాలు నిల్పివేయడానికి పునాదులువేస్తున్నాము. ముఖ్యంగా గతభారతదేశ చరిత్ర చూచినట్లయితే మన దేశంలో బ్రిటిషువారు ప్రవేశించి, రెండుమూడువందల సంవత్సరాలపాటు చీల్చిపారవేసేపద్ధతిలో పరిపాలన అమలుచేస్తూవున్నారని, ఒకజాతికి యింకొకజాతికి, ఒకప్రాంతానికి యింకొకప్రాంతానికి ప్రాంతీయవిభేదాలు రెచ్చగొట్టి, దేశంలో ఐక్యతలేకుండాచేసి, దేశాన్ని చీల్చిపారవేశారు. వారు హిందూదేశమును వదలిపెట్టిపోయినతరువాత, మన కాంగ్రెసువారు విభజించి పాలించేపద్ధతిని అమలుజరిపే రాజకీయకుతూహలముతో, యీ ప్రభుత్వాన్ని నడుపుదలచుకొన్నామంటూ యీ ఆంధ్రజాతినంతా చీల్చి అటు రాయలసీమవారని, యిటు సర్కారువారని యింగ్లీషువారు పాలించినవిధంగా యిక్కడ ప్రాంతీయ దురభిమానాలను రెచ్చగొట్టడం, ఆ విధంగా యీ కాంగ్రెసుప్రభుత్వం పరిపాలనచేయటం చాలా విచారకరము. రాజకీయదురభిమానాలతో ముఖ్యంగా రాయలసీమయని, సర్కారులనే విభేదాలు పెంచి, ఆంధ్రజాతిని చీల్చివేయటం అనేది మంచిదికాదని మనవిచేస్తున్నాను. రాయలసీమ కాలేజీలను మద్రాసు విశ్వవిద్యాలయంలో ఏ పరిస్థితులలో చేర్చినారో, ఆ రకంగా యీ నాటికికూడా అప్పటి పరిస్థితులు ఆ back ground అర్థంచేసుకోవలసినదని మనవిచేస్తున్నాను. ఈ రోజున రాయలసీమలో యేర్పడబోయే తిరుపతి విశ్వవిద్యాలయం Residential Universityగా వుంటేనే మంచిది. Andhra University వుండగా, యింకొక University పెట్టటం సరియైనదికాదని నేను అభిప్రాయపడుతున్నాను. మనం యిప్పుడు వాదనలుతీసుకువచ్చి నెల్లూరు కళాశాలలనుకూడా తిరుపతి విశ్వవిద్యాలయానికి affiliate చేయటంద్వారా ఎక్కువగా examination fees వస్తుందని ఆలోచిస్తున్నారు. ఆ విధంగా ప్రత్యేక University గా వున్నప్పుడు ఆ examination fees వల్ల దానికివచ్చే ఆదాయం ఆ University ని నడిపేందుకు వుపయోగపడుతుందని ప్రభుత్వము రు. 25 లక్షలు grant ఇచ్చే guarantee లేదనిచెప్పటం చాలా అసందర్భంగావుంది. నెల్లూరు colleges ను Tirupati University లో కలిపినట్లయితే, Andhra University కి క్రొత్తగా amounts అప్పుడూ యివ్వవలసినపరిస్థితులువుంటాయా? వేరువేరుగా రెండు విశ్వవిద్యాలయాలనుస్థాపించి నడపటం యేమీ ప్రయోజనకరంకాదు.

(At this stage Sri G. Nagabushanam occupied the chair.)

Examination fees పై యీ క్రొత్తగా యేర్పడబోయే University ఆధారపడేపరిస్థితులకన్న Residential University గా పెట్టటంవల్ల అట్టి అవసరం వుండదు. అందుచేత నెల్లూరు కళాశాలలను examination fees కోసమని చెప్పి, Tirupati University లో చేర్చుట మంచిదని భావింపబడుతోందనే వాదన సరియైనదికాదు.

[Sri K. Ranga Rao] [29th May 1954

Dr. V S Krishna Garu ముందుగా దీనిని Affiliating University గా పెట్టి, తరువాత Residential University గా మార్పుచేస్తే ఆంధ్రజాతి అంతా ఐక్యమగునని చెప్పారు.

ఉస్మానియా విశ్వవిద్యాలయము వచ్చినతరువాత Residential University గా పెట్టుకొనవచ్చునని ఒక సూచనచేశారు. ఒకే భాషాప్రాంతంలో రెండురకాల Affiliating Universities గా వుండటంవల్ల అనేక చెడుఫలితాలకు దారితీస్తుందనే సూచన ఆ నాడు అంగీకరించారు.

ముఖ్యంగా విశాలాంధ్ర యేర్పడినతరువాత ఉస్మానియా విశ్వవిద్యాలయాన్ని కేంద్రప్రభుత్వము తమ స్వాధీనములోకి తీసుకొనడానికి ప్రయత్నిస్తున్నది. విశాలాంధ్ర రావడానికి, విశాలాంధ్ర యేర్పడినతరువాత ఐక్యతను సాధించడానికి రాజకీయనాయకులు ప్రయత్నంచేయాలి. ఆంధ్రవిశ్వవిధ్యాలయం ఆంధ్రదేశంలో ఒక మూల ఉన్నదనినిన్న మంత్రిగారు చెప్పారు. అది నిజమే. అయితే వారు University మూలనవున్నదని చెబుతున్నారు కాబట్టి యీ వాదన అంతా Capital High Court ల స్థాపన విషయంలో కనుపించలేదా? అని అడుగుతున్నాను. ఆ వాదన కారణంగా రెండు Universities ను తీసుకురావడం యెందుకు? వెనుక Capital High Court ల విషయంలో వారికి కనబడలేదా? ఆంధ్ర ఐక్యతను కేంద్రీకరించేపద్ధతిలో సూచనలువున్నా యిప్పుడు యీ రాజకీయ తికమకలు యెందుకో కారణం తెలియకుండావుంది.

Opposition party లో వున్న సభ్యులు, ప్రభుత్వపక్షసభ్యులు Affiliating University పెట్టటంవల్ల అనేకవిధాలైన కృషిచేసి ఆంధ్రజాతిని రెండుగా చీల్చివేసి నట్లయితే అది తీవ్రపరిణామాలకు దారితీస్తుంది. అందుచేత యీ బిల్లులో Affiliating University ని పెట్టడానికని బిల్లులోని Clauses ను రద్దుచేసి అక్కడ Residential University ని పెట్టుటకుగాను ఆ రకమైన పద్ధతులలో మొత్తం బిల్లును సవరించాలని కోరుతూ యింతటితో విరమిస్తున్నాను

Sri K. Varadachari :— అధ్యక్షా! ఈ విశ్వవిద్యాలయం విషయంలో ప్రతిపక్షసభ్యులు రాజకీయాలను తెచ్చి దీనిని యెన్నివిధాల భీభత్సంచేయాలో అన్నివిధాల భీభత్సంచేయ జూస్తున్నారు. ఇది కేవలము విద్యాసంబంధమైనవిషయము. ఈ విషయంలో యీనాడున్నంది సానుభూతిచూపి ఆంధ్రదేశంలో అందరికీ శుభకరమైన యేర్పాట్లుచేసి తృప్తి పరచి మనదేశంలో విశేషభాగం జనాభా వున్నతవిద్యాసంపాదనకు సౌకర్యాలు కలుగజేసే ధోరణిలో ఆలోచించేవిషయం మరచిపోయేవిషయమైనదంటే ఆంధ్రవిశ్వవిద్యాలయము ఒకటి [illegible] యీ శాస్త్రంలో యింకొక విశ్వవిద్యాలయము వుండనేల? అనే పద్ధతిలో ఒక ముఖ్యార్థము నాకు అర్థముకావటములేదు. విశ్వవిద్యాలయాలు ఒకటిపైగా వుండ

కూడదని ఒకటికిపైగావుంటే అది ఒకప్రాంతానికి యింకొకప్రాంతానికి వైషమ్యాలు, పోటీలు కలుగుతాయని యీ విధంగా యీ debate సాగిపోతోంది. ఆంధ్రరాష్ట్రంలో యిప్పుడువుండే విశ్వవిద్యాలయాలలో వున్నతమైన ఆదర్శాలతో గొప్ప కార్యక్రమము జరుగుతోంది. దేశమంతటా కూడా యీ విశ్వవిద్యాలయము చాలా ప్రఖ్యాతి పేరు సంపాదించింది. అందరికి అది చాలా సంతోషకరమైనవిషయము. అయితే యిప్పుడు యేదో అన్నివిధాల గొప్ప కార్యక్రమము జరుగుతోంది అని చూస్తే దాంట్లో యెన్నో భిన్నాభిప్రాయాలువున్నవి. Post graduate courses, Honours courses యిక్కడ నిండా వున్నతమైనపంథాలో జరుగుతోన్నవి. నాకు ఆక్షేపణలేదు. అయితే మిగతాపనిలేదు. Affiliating University లో విద్యార్థులు యంత్రంలో (machine) వేసి produce or manufacture చేస్తున్నాము. ఆంధ్ర విశ్వవిద్యాలయంలో యెవరూ యేమీ జోక్యం పుచ్చుకోలేదు. ఈ విశ్వవిద్యాలయాల్లో syllabus తయారుచేయటం, Examinations conduct చేయటం, విద్యార్థులదగ్గర ఆ Examination fees తీసుకోవటము ఆ విధంగా వచ్చే సంపాదనను యింకొక భాగంలోవుండే విద్యార్థులకు వుపయోగించేవుద్దేశ్యముతో తృప్తిపడ్డారుగాని, మనదేశంలో విశ్వవిద్యాలయాలకున్నూ, affiliating కళాశాలలకున్నూ యే విధమైన సంబంధము వుండాలనేవిషయము మనం కొంచెము గమనించి చూస్తే, యీ గొప్పవిషయమును గురించి విశేషప్రముఖులైన Dr Radhakrishnan Committee అంటే అట్టి విద్యావంతులు ప్రముఖులు చక్కనిమార్గమును మనకు ఆదర్శప్రాయంగా చూపించారు. అది యేమిటంటే, కాలేజీలు చాలాకాలంవరకు affiliation అవసరమని వారు గుర్తించే యీ Affiliated Colleges కు University కు యేవిధమైన సంబంధంవుండాలనే విషయమును వారు గొప్పగా విమర్శించారు అది యేలాగున విమర్శించారు ? కళాశాలలు అన్నీ Independent bodies గా పెట్టి, అలా Independent వున్నాగాని, Independent Governing bodies గా వుండడానికి ఆ కళాశాలలో విద్యనేర్పే proffessors వుపాధ్యాయులు University లో University అధికారుల మూలంగా appointments జరుపబడాలి. వారు సరియైనవుపాధ్యాయులను, ప్రొఫెసర్లను నియమించి అన్ని కళాశాలలలోవుండే విద్యార్థులకు, అంటే యీ Affiliated Colleges లో విద్యార్థులకు ఒకేవిధమైన వున్నతవిద్య నేర్పుటకుకూడా యేర్పాట్లుచేయాలని వారు చెప్పారు.

తిరిగి అటువంటి కాలేజస్ కావాలంటే అఫిలియేటెడ్ కాలేజీస్ కాకుండా organic instrumental connection with the Universities అని కూడా వారు విపులంగా వ్రాశారు. ఈ పంథాలలో యూనివర్శిటీ జరగడానికి ఆంధ్ర విశ్వవిద్యాలయంలోకూడా ప్రయత్నం జరగలేదు. ఇక్కడ కేవలం public services కి Students ను manufacture చేయడంతప్ప అంతకుమించి ఏమీచేయబడలేదు. ఒక యూనివర్శిటీని తయారుచేసి ఇంకో యూనివర్శిటీ పెట్టడానికి ప్రయత్నంచేయడానికి కొంచం

కూడా మేము తావు ఇవ్వము" అని రాధాకృష్ణ కమిషన్‌వారి అభిప్రాయం. రాజకీయ దృష్టితో ఆంధ్రదేశంలో ఒక్క యూనివర్శిటీ ఉంటే చాలు, ఇంకో యూనివర్శిటీ అవసరంలేదని చెప్పడం చాలా పొరపాటు. ఇప్పుడు మీరు చెపుతున్న కారణాలన్నీ కూడా చూస్తే ఇంకో యూనివర్శిటీ పనిలేదని, రెసిడెన్షియల్ యూనివర్శిటీగా ఉంటే చాలని చెపుతున్నారు. దానికి నేను ఇప్పుడుచెప్పినవిషయం చూస్తే ఇంకో యూనివర్శిటీని ఇంకా ఉపయోగకరమైనపంథాలో, రాధాకృష్ణ కమిషన్‌వారు చెప్పినట్లు ఈ కాలేజీస్ అన్నీ కలిపి ఒక త్రాటిమీద నడిచేట్టుగా యూనివర్శిటీవారు నిర్ణయించి, ఉపాధ్యాయులచేత కాలేజెస్‌లో విద్యనేర్పేట్లుచేస్తే బాగుంటుంది. అది చాలా అవశ్యం. ఈ ఆంధ్ర యూనివర్శిటీ ఉండడంచేత వేరే ఇంకొకటి ఉండనవసరంలేదని చెప్పడం ఒక మూర్ఖమైన విధానమని చెపుతున్నాను. నెల్లూరువారిని లేవతీసి ఇంకొకటి చెప్పారు.

Sri P Venkateswarulu ·— On a point of order. నెల్లూరువారిని ఎవరో లేవకొట్టారని ఆయన చెపుతున్నారు. అది House మీద insinuation అవుతుంది. అటువంటిది ఏమీ లేకుండా చేస్తారని ఆశిస్తున్నాను.

Chairman (Sri G Nagabhushanam) — Mr Varadachari can proceed. No insinuation

Sri K. Varadachari — వెళ్లకొట్టారని నేను చెప్పలేదు. లేవతీశారని చెపుతున్నాను. (నవ్వు) నిజంగా వాళ్లను ఒక balance కోసమని, number of students సరిపోతారని ఈ బిల్లును చేశారు. కాని బలవంతంగా వాళ్లను తీసుకొచ్చి చేర్చుకోవాలనే దురుద్దేశంలేదని చెపుతున్నాను. లేకపోతే ఈ manufacturing of students గా ఇక్కడే ఉంటాం అంటే ఇక్కడే ఉండండి. ఈ యూనివర్శిటీకంటె, ఈ డిపార్టుమెంట్లకంటె అధికమైన తేజోవంతమైన విద్యార్థులను మేము తయారుచేయడానికి మమ్ములను కాపాడమని మిమ్ములను కోరుతున్నాను.

Sri V. Chidanandam :— అధ్యక్షా! మంత్రిగారు ఈ బిల్లును ప్రవేశ పెట్టేటప్పుడు select Committee లో opposition leader వేసిన ప్రశ్నలకు కమిటీవారు, ముఖ్యంగా వైస్ ఛాన్సలర్‌గారు, ప్రిన్సిపాల్ రంగధామరావుగారు ఇచ్చిన జవాబులు చదవడం అయింది. దానివల్ల సందేహాలు ఏమీ ఉత్పన్నంకావని చెపుతున్నాను. ఈ సందర్భంలో ఈ బిల్లును ఏకగ్రీవంగా pass చేయడానికి ఏమి అనుమానం ఉందో నాకు తెలియదు. లేకపోతే administrative గా కొంత డబ్బు ఖర్చు అవుతుంది. అక్కడనుంచి students ఇక్కడకు రావాలంటే చాలా వ్యయప్రయాసలతో కూడుకొన్నది. ఇక్కడ ఎంతమంది students ఉన్నారనేదికూడా ఆలోచించాలి. పోతే ప్రాంతీయ విభేదాలు ఉన్నాయి అని Opposition Leader శ్రీ నాగిరెడ్డిగారు అంటే, అదీ వారే లేవదీశారని అనుకుంటున్నాను. కులశాఖలు ఈ విద్యాసంస్థలలోకూడా ప్రవేశించాలనే

ట్లయితే అలా వారు చేయచ్చు. ఇది సకలజాతులు అభివృద్ధిజెందడానికి కావలసినవిషయం. మేము కోరినప్రకారం మాకు విశ్వవిద్యాలయం ఇమ్మని అందరిని ప్రార్థిస్తున్నాను. ఇప్పుడు మన వైస్ ఛాన్స్లర్ గారు దీన్ని రెసిడెన్షియల్ యూనివర్శిటీగా ఏర్పాటుచేయడానికి ఎక్కువ ఇష్టపడుతున్నారు. దానికి కారణాలు మనకంటె కూడా వారికి ఎక్కువగా తెలుసు. మనం ఏదో చదువుకొన్నవాళ్లము. అని అనుకొన్నప్పటికి మనకంటె వారికి ఎక్కువ తెలుసు. ఇదివరకే కొన్నికాలేజీస్ చేరితే ఆదాయం ఖర్చు సరిపోతుందని నేను—చెప్పాను. రెండు యూనివర్శిటీలు స్వతంత్రంగా పనిచేసి ఆర్. ఎల్. స్టీవెన్సన్ చెప్పినట్లు విపులీకరించేటటువంటి విద్యను మా తిరుపతి యూనివర్శిటీలో పెట్టి మేము జయప్రదంగా నిర్వహించగలమనే నేనుకూడా ఆశిస్తున్నాను. అందుచేత ఈ బిల్లును మీరంతాకూడా ఆమోదిస్తారని ఆశిస్తున్నాను.

Sri T. N. Venkatasubba Reddi.—Mr. Deputy Speaker, Sir, I do not propose to add any argument to the numerous arguments advanced from either side of the House on this Bill for the last two days. I just want to think aloud as a common man with no expert knowledge or special ability to discuss a subject of this nature. I should have thought that the desire on the part of anybody to establish an institution like a University would have received the approbation of all. But what do we see here? A discussion, which has been fairly acrimonious! We have had arguments from both points of view, and we have had arguments which are midway between both points of view. All this leads a man who has no special knowledge (I mean one like myself) to a little confusion, and so I am attempting to do nothing more than think aloud the trend of that confusion.

The sponsors of the University have told us that it is being undertaken to supplement existing educational facilities in our State. On the other hand, we have come across the Opposition with arguments charging the Government that this Bill will result in the accentuation of the existing differences of regionalism in the State. Both sides have argued their view point with the help of expert opinion. I would start on the premise that their is no such thing as any suspicion between regions in this State. So I would like to ask myself what really is the trouble. It is said that we are in need of a second University in this State. As far as I have been able to understand the many reasons put forward for this necessity, the one thing that seems to hold little water is that the situation of the existing University is far remote and that it will be very hard to the people living in the other extreme of the State to come here for their education.

This seems to be not a reasonable argument why a second University should be started. For, just weigh against it the expenditure involved in such a course being adopted. Consider what the expert committee report says with regard to the necessary finance required, both initial and recurring running to lakhs and lakhs. So I think it would be much simpler if the Tirupathi Devasthanam comes forward with a lakh of rupees every year, distribute it among the several Rayalaseema colleges as so many scholarships to poor and deserving pupils willing to proceed to Waltair to study in the research courses. I think such a thing would have satisfied the poor deserving students. On the other hand, arguments have been advanced to start new course of study, in the new University to be set up, which do not exist in the existing Andhra University. To me, it does not appear to be a good reason for starting a new university. All this, has put me in a state of confusion and I am not able to get out of it, and so I content myself with the hope that only good will come out of this new University and that no harm will come. I cannot say anything more than that and I wish that hope will be realised.

Sri K. V. Ramesam —Mr. Deputy Speaker, Sir, I am afraid that any views expressed by any member in this House contrary to the provisions of the Bill are understood to be accentuated by motives other than legitimate. This is an unfortunate state of things which I regret very much. Coming to the point under consideration, I would ask, "What are the needs of the students of Rayalaseema colleges, or to be more correct, of that area?" They require more educational facilities. I agree. With that, nobody in the House is in disagreement. We have to provide them with more educational facilities, it is true. And it is true also that Waltair is far away from Rayalaseema. So, what is the remedy? In the present tempo of things, any expression contrary to the general trend will be certainly disapproved by the public. So in order to obviate the difficulty, it is suggested that a new University should be started in Tirupati for Rayalaseema area. On that point there is a general agreement. But on the question, whether it should be a residential University or an affiliating University, there is a very sharp difference of opinion; and I am sure, that in the end, even Government will find its way to accept the position that for the present Rayalaseema should have only a residential University. It is said that affiliation of only some of

29th May 1954] [Sri K. V. Ramesam]

the colleges in Andhra Desa, namely, Rayalaseema, including Nellore, would lead to disunity and different standards of education. There is some force in that argument, and so, I hope, after mature consideration, Government will accept the suggestion that for some time to come from now, when the new University starts functioning, it should be treated as a residential University only, and that after examining the functioning of the University, the question of affiliation may be considered.

Turning to the other question, whether it would be possible in the present state of things to start the University on 1st July 1954, I have to state, that it is said that our State is lacking in finance, that we are having a deficit budget, and that it is not able for lack of funds to start several schemes. That being the case, how can a new University be started now. The new University will require magnificent buildings, good laboratories to start science courses and so on. So, how can these be had without lot of funds? It is a well known fact that the Andhra University grew up only slowly. It has grown up in the course of a period of quarter of a centuary. Yet, even now, it has not been able to satisfy the needs of the students here. So, it is better we start with a few courses in Tirupati, develop it slowly, so that in course of time it may be made into a full fledged University. Here I have to utter a word of caution to Government. When we are lacking in funds, we should see that the available funds are not unnecessarily wasted. For, I am reminded of the reply of the Hon. Deputy Chief Minister made on the floor of the House the other day, how in the Institute of Oil Technology, Anantapur, only seven students are there for the whole institution, when the working expenses of the Institute was running to one lakh and odd. That is not a satisfactory way of spending finance. That gives the idea, how far students from Rayalaseema are able to take advantage of the facilities afforded to them. Therefore my first appeal to Government is, let not State funds be wasted. My second appeal to Government is, instead of opening all courses in Tirupathi, open only such courses as are necessary for the present, and then after a time, just as the Andhra University has grown up, open a University at Tirupathi. So my third appeal to Government is not to open the new University in July next, that is, in July 1954. The expert committee itself has also said that it is not possible to do so, for it is not possible to secure the necessary staff, nor the necessary strength of students nor other facilities. Above all, there is no guarantee of funds. That being so, it will not be possible to start the new University before

1st July 1955. In the meantime necessary steps may be taken in that behalf by way of buildings, staff and laboratory. It is said also that there is lack of water facilities; and over and above all these things, there is the fact that the Union Government will not give grant until the scheme is perfected. For all these reasons I appeal to the Government that this Bill may not be given effect to till 1st July 1955.

Sri G Yellamanda Reddi — ఉపాధ్యక్షా! ఈ యూనివర్సిటీ బిల్లు మీద మాట్లాడుతూ అసలు అనేకమంది ముఖ్యవిషయమైన యీ యూనివర్సిటీ affiliating గా వుండాలా లేక residential గా వుండాలా అన్నవిషయానికి సంబంధించి మాట్లాడితే చాలా బాగుండేది. అనేకమంది పెద్దలు అసలువిషయాన్ని మరుగుపరుస్తూ ప్రతిపక్షం చెప్పినవిషయాలు చెప్పినట్లుగాక వేరుగా చెప్పడానికి ప్రయత్నించడం దురదృష్టకరం అయినవిషయం ముఖ్యంగా వరదాచారిగారు రాధాకృష్ణకమిటీ చెప్పినట్లు రాయలసీమలో ప్రతిపక్షం మెషీనులను తయారుచేసినటువంటి ఆంధ్రా యూనివర్సిటీని affiliate చేయాలని చెప్పినట్లు వారు చెప్పారు. వారికి మనవిచేసేది యేమిటంటే యిక్కడవున్న వెంకటేశ్వరయూనివర్సిటీబిల్లు proposal తయారయినప్పుడు ఇదివఱకున్న యూనివర్సిటీమాదిరి prototype తయారుచేస్తున్నది కాదా అని ప్రశ్నిస్తున్నాను.

Sri K Varadachari .— బిల్లులో వుండనక్కరలేదు.

Sri G. Yellamanda Reddi — ఇటువంటిది ప్రభుత్వం చేయలేదు. ప్రతిపక్షంకూడా దేశంలో కేవలం మెకానికల్ గా students ను తయారుచేయడంకాకుండా creative thought భాగావుండే, దేశసేవకుపనికి వచ్చేటట్లు విద్యార్థులను తయారుచేసే యూనివర్సిటీ ప్రభుత్వం స్థాపిస్తూంటే ప్రతిపక్షం దానిని బలపరచడానికి సిద్ధంగావున్నది. కాని సమస్య అదికాదు. ఈ నాటి సమస్య రాయలసీమ యూనివర్సిటీ affiliating గా వుండాలా లేక residential గా వుండాలా అన్నది. ఆ సందర్భంలో ప్రతిపక్షం ఈ నాటి ప్రస్తుత రాజకీయపరిస్థితులలో ఆంధ్రరాష్ట్రంలో 2 affiliating యూనివర్సిటీలు పనికిరావని మాత్రమే అంటుందికాని రాయలసీమకు ప్రత్యేకయూనివర్సిటీ అక్కరలేదని ప్రతిపక్షం అంటున్నదని యీ రకంగా సభ్యులను mislead చేయడానికి వరదాచారిగారు ప్రయత్నించడం చాల విచారకరమైన విషయం. విద్యావేత్తలయిన రంగధామ రిపోర్టులో 2 affiliating యూనివర్సిటీలువున్నాయని చెప్పారు. వారు ఒక ముఖ్యమైన విషయం గమనించకుండావున్నారు. ఒకే భాషాప్రయుక్తరాష్ట్రంలో రెండు అఫిలియేటింగు యూనివర్సిటీలు లేవు అన్నవిషయం గమనించనట్లు తెలుస్తున్నది. మధ్య ప్రదేశ్ లో నాగపూరు, సాగర్ యూనివర్సిటీలున్నాయి.అందులో నాగపూరుయూనివర్సిటీ మహారాష్ట్రంకు సాగర్ యూనివర్సిటీ హిందీభాషకు చెందియున్నాయి. రెండు భాషా ప్రయుక్తప్రాంతాలకు రెండు యూనివర్సిటీలువున్నాయి. అదేరకంగా బొంబాయి,

ధార్వార్ యూనివర్శిటీలున్నాయి. ధార్వార్ యూనివర్శిటీ సౌరాష్ట్రులకు బొంబాయి మహారాష్ట్రులకు యూనివర్శిటీ ఏర్పరుచబడినవి. ఎక్కడో ఒకటి అర, వుండినవని మంత్రిగారు చెబితే చెప్పవచ్చును. కాని సాధారణంగా భారతదేశంలో యిలాంటి feature లేదు అని చెప్పి ప్రత్యేకంగా ఆంధ్రదేశంలో రాయలసీమ సర్కారు అనే విభేదాలన్నీ యీ దురదృష్టకరపరిస్థితులలో మనరాష్ట్రంలో అలాంటివి వుండకూడదని మనవిచేస్తున్నాను. తరువాత నెల్లూరుకాలేజీలను వెంకటేశ్వరయూనివర్శిటీలో చేరుస్తున్నామని మంత్రిగారు సెలవిచ్చారు. నెల్లూరుజిల్లావారిని లేవకొడుతున్నారని వరదాచారిగారు చెప్పారు. ప్రతిపక్షంవారు చేస్తున్నది నెల్లూరుజిల్లావారిని లేవగొట్టడం ఆపుచేయడానికి ప్రయత్నిస్తున్నదనిమాత్రం నేను అనుకుంటున్నాను. ప్రతిపక్షానికి సంబంధించని వార్తాపత్రికలు వెంకటేశ్వరయూనివర్శిటీ 20 సంవత్సరాలుకుగాని అభివృద్ధిచెందదు. అలాంటి యూనివర్శిటీలో నెల్లూరుకాలేజీలను చేర్చడం నెల్లూరుకాలేజీ విద్యార్థులకు అన్యాయమనీ దాన్నిగురించి ఆలోచించాలని నెల్లూరుపత్రికలు వ్రాశాయి ఆది ప్రజాభిప్రాయంక్రింద తీసుకుని నెల్లూరుజిల్లాలోని కాలేజీలను వెంకటేశ్వరయూనివర్శిటీలో కలపడం విరమించాలని కోరుతున్నాను అసలు general గా యూనివర్శిటీ రెసిడెన్షియలు అన్న point వున్నది. కాబట్టి నెల్లూరుకు ప్రత్యేకంగా కలపనవసరంలేదు. ఇది majority అభిప్రాయం. ఇక్కడవున్న M. L. A లలో చాలమంది యీ అభిప్రాయాన్నే వెలిబుచ్చారు కనుక దీనిని తప్పకుండా ఆలోచించాలని చెప్పి కోరుతున్నాను.

ఆదికేశవులునాయుడుగారు మాట్లాడుతూ, ప్రతిపక్షంవారు ఇదమిద్ధంగా రాయలసీమకు యూనివర్శిటీ ఉండాలని చెప్పలేదు అని సెలక్టుకమిటీలో సభ్యులు చెప్పారు అన్నారు. అది సబబుగాదు. రాయలసీమలో ప్రత్యేక యూనివర్శిటీ పెట్టుట బలపఱచుటకు opposition సిద్ధంగాయున్నది. కాని అది Affiliating University గా ఉండకూడదని చెప్పుచున్నాము. ప్రతిపక్షం యూనివర్శిటీ వద్దని చెప్పడంలేదు. ఆవిషయంలో బలపర్చుటకు తయారుగాయున్నది. నెల్లూరుజిల్లాలోని కాలేజీలు తిరుపతి యూనివర్శిటీలో చేర్చుటకు ప్రతిపక్షంవారు ఇష్టపడుటలేదు. ప్రజాభిప్రాయం, రాజకీయపరిస్థితులు, విద్యార్థులకు తగిన వసతులు కల్పించుట voice చేయుటకు అసెంబ్లీసభ్యులలో 5 మందికైనా సెనేటులో ప్రాతినిధ్యం ఉండాలనేవిషయం ఆలోచించవలసియున్నది. మూడవ విషయం Vice-chancellor ను ఏ ఛాన్సెలరో nominate చేయడంలో ఇబ్బందులున్నవి అని చెప్పుచున్నారు. అంతేకాకుండా Vice-chancellor ను appoint చేయడంలో, అందులో Chancellor appoint చేయడంలో అర్థం, అధికారంలో ఉన్నవారి పలుకుబడినిబట్టి జరుగుతుంది. రాజకీయ consideration లేకుండా, senate members దృష్టిలోపెట్టుకొని Vice-chancellor ను ఎన్నుకొనుటకు సంపూర్ణ అవకాశం ఈ బిల్లులో ఇవ్వవలసియుంటుంది. ఆ రకంగా మార్పులుచెయ్యాలని కోరుతున్నాను ఆంధ్రారాష్ట్రంలో రెండు యూనివర్శిటీలుపెట్టడం ప్రతిపక్షం బల

[Sri G Yellamanda Reddi] [29th May 1954

పరుస్తుంది. కాని క్రొత్తగా పెట్టబోయే యూనివర్శిటీ affiliating యూనివర్శిటీ వద్దని చెబుతోంది ప్రభుత్వపక్షంలోయున్న సభ్యులు, ప్రతిపక్షసభ్యులు రాయలసీమ అభివృద్ధికి వ్యతిరేకంగా యున్నారనిగాని, నూతన విద్యావిధానం తయారుచేయబోతూ ఉంటే వ్యతిరేకంగా యున్నారనిచెప్పడం సత్యదూరం. ఈ రకంగా ప్రచారంచెయ్యడం అసమంజసం. క్రొత్త విశ్వవిద్యాలయం ప్రజలలో చీలికలుకల్పించేదిగా ఉండకూడదని హెచ్చరిస్తున్నాము.

Sri G. Sivasankara Reddi — అధ్యక్షా! ప్రభుత్వంవారు ఆంధ్రరాష్ట్రంలో రెండవయూనివర్శిటీ స్థాపించుచున్నందకు ప్రభుత్వంవారిని అభినందించుచున్నాను. కొంతమంది ఈ బిల్లుకు objection చెబుతున్నారు. బహుశః అది Residential University గా ఉండాలనిచెప్పడమే వారి అభ్యంతరం అనుకుంటాను. అలాంటప్పుడు యూనివర్శిటీస్థాపనకు అభ్యంతరంచెప్పకుండా type కు మాత్రం అభ్యంతరం పెట్టడములోకల అంతర్యం, నాకు బోధపడడంలేదు. యూనివర్శిటీస్థాపనకు అభ్యంతరం లేదంటూ type కు మాత్రం అభ్యంతరం చెప్పుచున్నవారు. యూనివర్శిటీ విద్యాసంస్థ కనుక దానిస్థాపన కే అభ్యంతరము తెలుపునంతటి moral తాహతులేనందువల్ల అట్లాంటి అభ్యంతరం తెచ్చుచున్నారు అని నేను తలుస్తాను. అది affiliating గా చేస్తే ప్రాంతీయ విద్వేషాలకు చోటు ఇస్తున్నారని చెబుతున్నారు. ఎన్నిరాష్ట్రాలలో, ఎన్నిదేశాలలో, ఒకటి కన్న ఎక్కువ యూనివర్శిటీలు ఉండడములేదు? అక్కడ ప్రాంతీయవిద్వేషాలకు దారి తీస్తోందనే విచిత్రవాదము ఎక్కడా వినలేదు. దురదృష్టవశాత్తు ఈ విచిత్రమైనవాదన విచిత్రమనస్తత్వము కల్గిన ఆంధ్రరాష్ట్ర రాజకీయవాదులకే చెల్లునేమో? ఇంకా కావాలంటే రెండు యూనివర్శిటీలమధ్య విభేదాలు రాకుండా మార్పులు సూచించవచ్చును. ఏమిటంటే ఒక యూనివర్శిటీ Vice-chancellor ఇంకో యూనివర్శిటీ Ex-officio Member గా ఉండడం ఆంధ్రాయూనివర్శిటీకి చెందిన Area నుండి, కొంతమందిని వెంకటేశ్వరాయూనివర్శిటీ సెనేటుకు ఎన్నుకుంటే భేదాలురాకుండా సర్దుకోవచ్చని మనవిచేస్తున్నాను. ప్రాంతీయవిద్వేషాలంటున్నారే. అలాగైతే రాయలసీమ కాలేజీలు మదరాసుయూనివర్శిటీలో affiliate అగుటకు కారణమేమిటి? ఆర్థికంగా లోటుప్రాంతమైన రాయలసీమప్రాంతవాసులు తమబాలురను దూరంగాయున్న వాల్తేరుకు పంపుటకు వీలులేనందువల్ల మదరాసులో ఉండటం జరిగింది. క్రొత్తయూనివర్శిటీ residential చేసి రాయలసీమకాలేజీలు వాల్తేరులోయున్న ఆంధ్రాయూనివర్శిటీకి affiliate చేయడంవల్ల ఆ పరిస్థితిలో మార్పులు కలుగుతుందా అని ప్రశ్నిస్తున్నాను? ఏమిమార్పు కలగటంలేదే. వెంకటేశ్వరాయూనివర్శిటీ residential గా చేస్తేమాత్రం రాయలసీమకాలేజీలు మరల మదరాసు యూనివర్శిటీలోనే ఉండాలనే వాదంలోకో, C. R. రెడ్డిగారి report ననుసరించి, అనంతపురంలో మరొక యూనివర్శిటీ sub centre కావాలనే వాదమో బయల్దేరుతుందని చెప్పుచున్నాను. ఇంతవరకూ politicians లేవదీసే...తూయుంటే ఇకమీద students కూడా పాల్గొనే అవకాశం కల్గచేస్తున్నాం

అని హెచ్చరిస్తున్నాను. ఈ యూనివర్శిటీ residential గా ఉంటే దానికి హెచ్చుగా grant కావలసియుంటుంది. ఈ గ్రాంటువిషయమై ప్రతి Budget session లోను, ప్రాంతీయవిద్వేషాలు హెచ్చుపెరిగిపోయిన ఈ శాసనసభముందు చాలా ప్రమాదకరమైన విషమసమస్యగా ప్రత్యక్షముకాగలదని మాత్రం హెచ్చరిస్తున్నాను ఈ యూనివర్శిటీ affiliating గా ఉండాలనీ నెల్లూరులో ఉన్న కాలేజీలుకూడా దీనికి affiliate చేయాలనీ మొదటినుండి తిరుపతికాలేజి Principal గా యుండి retire అయిన, నెల్లూరువాసి శ్రీ K రామిరెడ్డిగారు నాకు రెండు ఉత్తరాలు వ్రాసియున్నారు ఈ యూనివర్శిటీకి affiliate కావలసిన ప్రాంతంలోని విద్యార్థుల సంఘాలలో చాలాభాగం ఇది affiliating యూనివర్శిటీగా ఉండాలనే అభిప్రాయం వెలిబుచ్చారు. అలాంటి పరిస్థితులలో ఎల్లాంటి విద్వేషాలకూ దోహదం ఇవ్వకుండా ప్రతి ఒక్కరూ ఈ వెంకటేశ్వరా యూనివర్శిటీ affiliating గా ఉండునట్లుచేసి, ఈ యూనివర్శిటీని రూపొందించాలని కోరుతున్నాను.

Sri M Subba Reddi.—ఉపాధ్యక్షా! ఈ యూనివర్శిటీ బిల్లువిషయంలో అన్నివిషయాలూ ఆలోచిస్తే యూనివర్శిటీ అక్కర్లేదని ఎవ్వరూ చెప్పడంలేదు. యూనివర్శిటీ కావలసినదేకాని, ఐతే అది residential గానా, affiliating గానా. లేక residential, affiliating, teaching విధంగానా అనే విషయమై భేదాభిప్రాయాలున్నవి. చాలామంది residentialగా యుండుటకు ఒప్పుకునేటట్లున్నారు. ఇక affiliating గా ఉండాలన్నవిషయంలోనే భేదాలున్నట్లుతోస్తోంది. ఐనా ముఖ్యంగా ఇది affiliating University గా ఎందుకుండాలనిచెప్పి వాదించినవారుకూడా affiliating యూనివర్శిటీగా ఉన్నందువల్ల వచ్చేనష్టం ఏమిటో ఎవ్వరూ చెప్పలేదు Affiliating గా యుంటే చాలా మేళ్లున్నవని చెప్పుచున్నాను ఇప్పుడు మదరాసు యూనివర్శిటీకి affiliate అయియున్న రాయలసీమకాలేజీలను వెనువెంటనే తిరుపతి యూనివర్శిటీకి affiliate చేయవచ్చును, లేకపోతే ఆంధ్రాయూనివర్శిటీకి affiliate చేసుకుని మరికొంత కాలమైనతరువాత తిరుపతి యూనివర్శిటీకి affiliate చేసుకుంటే అనేక చిక్కులు వస్తాయి. విద్యార్థులు బాధపడతారు, వారి తల్లిదండ్రులు చిక్కుపడతారు. Fail ఐతే ఇప్పుడు Madras లో ఉన్నవారు అక్కడ బాధపడడం, ఇక్కడ చదువుకొన్నవారు ఇక్కడ బాధపడడం ఉంటుంది కాబట్టి వెను వెంటనే తిరుపతియూనివర్శిటీకి ఈ కాలేజీలు చేర్చ ప్రారంభించవచ్చును. ప్రారంభించడంలో large scale లో కాకుండా, కొద్ది scaleలో ప్రారంభించవచ్చు. Full-fledged యూనివర్శిటీ ఒక్కతూరే అవుతుందా? ఆంధ్రా యూనివర్శిటీ ఈ స్థితికి రావాలంటే 35 సంవత్సరాలు పట్టింది. ఆంధ్రాయూనివర్శిటీ కూడా మొదట్లో ఈ స్థితిలోనేయుండి 1945 నుంచి అభివృద్ధికివచ్చింది. యుద్ధానంతరం ఏర్పడినపరిస్థితులనుబట్టి డబ్బు ప్రజలలో విరివిగా పెరిగినందువల్ల విద్యార్థులు ఎక్కువమంది కాలేజీలలో చదువుకొనుటవల్ల, fees వల్ల

[Sri M. Subba Reddi] [29th May 1954

వచ్చేడబ్బు ఎక్కువైనందువల్ల సహాయం ఏర్పడింది. ప్రభుత్వానికి డబ్బు ఇచ్చుటకుకూడా బలం ఏర్పడింది

ఇప్పటిపరిస్థితులలో తిరుపతిలో యూనివర్సిటీకూడ ప్రారంభించే ఎడల తిరుపతికూడ మంచిస్థితికి వచ్చేపరిస్థితులు ఉన్నాయి. అదికాకుండా దీనిని affiliating యూనివర్సిటీ చేసేపక్షంలో, ఏవిధమైన standard syllabus ఏర్పాటుచేసుకొంటారో దానిమేరకు Honours Courses మొదలైనవాటికి అనుకూలముగ చేసుకొంటారు. తిరుపతి దేవస్థానమువారు 35 లక్షలు బిల్డింగులకు ఇస్తాము అన్నపుడు అసలు 120 లక్షలు మొత్తంలో, మూడింట ఒకపాలు తగ్గిపోతుంది. అందువల్ల ఇపుడే దానిని స్థాపించవలెను. అందులో బాధ ఏమి ఉంది? నిదానంగా చూస్తామంటే బాగా ఉండదు. ముందు ఆర్థిక దుస్థితి ఏర్పడవచ్చును. ఇప్పటికే ఆర్థికదుస్థితి ప్రారంభం అయింది. పోయినసంవత్సరం నంద్యాలలో కాలేజీ start చేస్తామని అన్నాము. చాలామంది సహాయంచేయుటకు వాగ్దానంచేశారు. అప్పుడు కాలేజి ప్రారంభంకాలేదు అప్పుడు చందాలువేసినవాండ్లను, ఇప్పుడు అడిగితే డబ్బుకు చాలా ఇబ్బందిగ ఉంది, కొంతకాలం ఆగితే బాగుంటుంది అని అంటూ ఉన్నారు. అందువల్ల ఇపుడే స్థాపించి affiliate చేస్తే బాగా ఉంటుంది.

కర్నూలులో, నంద్యాలలో కాలేజీలు start చేయడానికి సిద్ధంగా ఉన్నారు. ఏర్పాటుచేయవచ్చును. అట్టిసందర్భంలో వెనువెంటనే Affiliating University చేయకపోతే Affiliating విశ్వవిద్యాలయం ఏర్పడేపరిస్థితులు కాలము జరుగుకొలది మారవచ్చును. రెండుసంవత్సరములలో ఆర్థికస్థితిగూడా మారిపోవచ్చును. ఆర్థికదుస్థితి ఏర్పడవచ్చును. ఇప్పుడు ఉన్న strength కూడా లేకుండాపోవచ్చును. కాబట్టి వెనువెంటనే Affiliating, Residential & Teaching type గా ఉంటే బాగుంటుంది. కావలసిన atmosphere లేదని అంటారు. ఎందుకులేదు? దాని అంతట అదే వస్తుంది. ఇక్కడ ఆంధ్రయూనివర్సిటీలో మొదట అట్టివాతావరణం ఉండిందా? ఇన్నిబిల్డింగులు ఉండినాయా? క్రమేణ ఏర్పడ్డాయి. అక్కడ ఉండే పరిస్థితులు అక్కడ ఉన్నాయి. ఇక్కడిపరిస్థితులలో విశ్వవిద్యాలయం పెరిగింది అంటే మహానుభావులు C. R. రెడ్డిగారు, రాధాక్రిష్ణన్ వంటివారు ఉండినారు. తిరుపతికికూడ అట్టి మహానుభావులు రావచ్చును. ధనవంతులు డబ్బిస్తామని అంటూ ఉన్నారు. ఈ పరిస్థితులలో చాలమంది ముందుకు రావచ్చును. కాబట్టి వెనువెంటనే విశ్వవిద్యాలయం స్థాపించితే బాగా ఉంటుంది. మనస్నేహితులు కొందరు ప్రాంతీయ విభేదాలు ఏర్పడుతాయి అని అంటున్నారు. యూనివర్సిటీ ఏర్పడడంవల్ల విభేదాలు ఏర్పడుతాయని చెప్పడం అంత సమంజసంగాలేదు. కలసిమెలసి తిరగడంలోవుందిగాని, యూనివర్సిటీ ఏర్పడడంవల్ల అట్టివి ఏర్పడవు. విభేదములు ఇక్కడే ఎక్కువగవున్నవి అనలేము. మా వైపు విద్యార్థులకు ఇక్కడ సీట్లు ఇవ్వడంలేదు. మా జిల్లాలవాండ్లకు First Class రావలెనంటె చాలా కష్టం. ప్రొఫెసర్లు అంతా వాండ్లవాండ్లే. మమ్ములను కంటుకుచేవారు లేరు అని మా వైపు విద్యార్థులు అంటారు. రాయలసీమలో ప్రత్యేకంగా

ఒక లోకల్ యూనివర్శిటీ ఉండేపక్షంలో ఆ ప్రాంతములో ఉండేవారు చదువుకొనుటకు గాని, ఉద్యోగాలలో చేరటానికిగాని అనుకూలంగా ఉంటుంది. యూనివర్శిటీలోకూడ ఉద్యోగాలు సంపాదించుకొనుటకు అవకాశం ఉంటుంది. కాబట్టి ఈ సందర్భంలో రాయలసీమకు affiliating యూనివర్శిటీ కావలెనని చెపుతూ విరమించుకొంటూ ఉన్నాను.

Sri N V L Narasimha Rao — ఉపాధ్యక్షా! నేను మొత్తంమీద పది పన్నెండు సవరణలు తెచ్చాను. నేను చెప్పకోవలసినపుడు చెప్పకొంటాను. అందుచేత క్షమించవలెనని కోరుతూ ఉన్నాను.

Sri R Siddanna Gowd — ఉపాధ్యక్షా! ఒకేభాషగల రాష్ట్రంలో రెండు యూనివర్శిటీలు ఉండడం ఎక్కడ లేదు అని నాకు తెలుస్తుంది. గాని రెండు ఒకేవిధమైన యూనివర్శిటీలుగ ఉండడం చాల విచారకరముగా ఉంటుంది. ఒకభాగములో ఒకవిధమైన యూని ర్శిటీ, రెండవభాగములో మరొకవిధమైన యూనివర్శిటీ అనగా ఒక భాగములో affiliating, రెండవభాగములో residential యూనివర్శిటీ (గురుకుల విద్యాలయం) ఉండడం సముచితముగ ఉంటుంది ఒక ప్రాంతమువారు ఒకవిధమైన యూనివర్శిటీలో చదువుకొనుటకు, అభిలషించుటవల్ల ఆ ప్రాంతములో చదువుకొనుటకును, తక్కిన ప్రాంతమువారు మరొకవిధమైన యూనివర్శిటీలో చదువడంలో (affiliating కానియ్యండి, residential కానియ్యండి) రెండు ప్రాంతములవారిలో సుహృద్భావమును, సమైక్యతను పెంపొందింపజేస్తుంది. రెండు యూనివర్శిటీలున్నూ Affiliating Universities గా నెలకొల్పబడినట్లయితే, అవి ప్రాంతీయవిభేదాలకు దారితీసి undue competition ను rivalry ని పెంపొందింపచేస్తుంది అని నా అభిప్రాయం. ఇతరరాష్ట్రాల విషయం చెప్పి, కొంతమంది మిత్రులు బొంబాయిరాష్ట్రమును తీసుకొని అచట రెండు మూడు యూనివర్శిటీలు లేవా అని ప్రశ్నించి, ప్రశ్నకు జవాబుచెప్పారు. బొంబాయిరాష్ట్రంలో పూనాలో మహారాష్ట్రభాషకు చెందిన యూనివర్శిటీ ఉన్నది. బెలగాములో కర్నాటకులకు సంబంధించిన యూనివర్శిటీ ఉన్నది మరొకభాగములో మరొకభాషకు సంబంధించిన యూనివర్శిటీ ఉంది. ఆంధ్రదేశములో ప్రజలు ఒకేభాషకు చెందినవారు అయినందువల్ల రెండు యూనివర్శిటీలు ఉండడం అనవసరం అని భావించుచున్నపుడు, ఒకచోట ఒకవిధమైన యూనివర్శిటీ, మరొకచోట మరొకవిధమైన యూనివర్శిటీని ఏర్పాటుచేయడంవల్ల దేశానికి చాల అభివృద్ధిదాయకముగను, అభ్యుదయకరముగాను ఉంటుంది అని నా అభిప్రాయం.

పోనీ ఒకేవిధమైన యూనివర్శిటీలను ఏర్పాటు చేసుకున్నట్లయితే రాయలసీమ చాలా బీదప్రాంతం. అక్కడ పెడితే, అది స్వయంపోషకత్వంగావుండదని నేను భయపడుతున్నాను. చదువుకునేవిద్యార్థులు చాలా తక్కువమందివుంటారు. High Schools చాలా తక్కువగావుంటాయి. ప్రభుత్వంవారి సహాయంలేని రాయలసీమ High Schools లో చదువుతున్నవారు ఎక్కువమంది Colleges లో చదువుకోటానికి అవకాశంవుండదు. చాలామంది బీదవారుగావున్నారు. అందువల్ల కాలేజీలలో చదువుకునే విద్యార్థులసంఖ్య

చాలా తక్కువగావుంటుందని శంకించవలసివుంది. రెండు యూనివర్శిటీలు ఏర్పడేటప్పుడు వాల్తేరులోది affiliating University గాను Tirupati లోది Residential University గాను చేయటంవల్ల ఇక్కడివారు అక్కడ, అక్కడివారు ఇక్కడ చదవటంవల్ల Affiliating Universityలో చదవటానికి అభిలషించే రాయలసీమ వాస్తవ్యులు, వాల్తేరువచ్చి చదువుకోవటమువల్ల రెండూ ప్రాంత్యాలకూవుండే ప్రాంతీయభావాలు నశించి, అందరము ఒకేతరగతివారి బిడ్డలమనే భావము పెరిగి సమైక్యతను పెంపొందించగలమని చెప్పుతున్నాను. ఇదివరలో నెల్లూరుకాలేజీలు వాల్తేరు University లో చేర్చివుండినవి. వాటిని వాల్తేరు University నుంచి తప్పించి తిరుపతి University లోకి ఎందువల్ల చేరుస్తున్నారో అర్థంకావటంలేదు. 25 సంవత్సరాలనుంచీ ఆంధ్రయూనివర్శిటీలో చేర్చి వుండుటవల్ల నెల్లూరు కాలేజీలు ఒక స్థాయికివచ్చారు. క్రొత్త University లో ఈ కాలేజీలను చేర్చటంవల్ల ఆ స్థాయి కొంత తగ్గిపోవచ్చుననే భయముగావున్నదని తెలియజేసిరి. ఇంతటితో ముగిస్తున్నాను.

Sri S. Narayanappa :— అధ్యక్షా! ఇప్పుడు ప్రభుత్వంవారు శ్రీ వెంకటేశ్వరా University స్థాపనగురించి తెచ్చినబిల్లు చాల సమంజసముగావున్నది. ఇందుకు ప్రభుత్వమును అభినందిస్తున్నాను. 30 ఏండ్లుగా రాయలసీమలోవున్న ప్రజలు వాంఛిస్తున్నటువంటి ప్రత్యేక విశ్వవిద్యాలయాన్ని నేడు స్థిరపర్చడానికి ప్రభుత్వం తలపెట్టిన ఈ Bill ను ప్రవేశపెట్టినందులకు మిక్కిలి ముదావహము. ప్రతిపక్షసభ్యులు గాని, లేక ఇతరపార్టీ సభ్యులుగాని ఈ సభలో వెల్లడించిన అభిప్రాయాలను చూస్తే, యీ విశ్వవిద్యాలయం రాయలసీమలో నెలకొల్పటమనేది చాలా ఉత్తమమైనవిషయం. దీనికి మా ఆమోదము వుందనిచెబుతున్నారు. ఐతే గురుకులవాస విశ్వవిద్యాలయమా? లేక అనుబంధ విశ్వవిద్యాలయమా? అన్నది సమస్య. దీనిమీద వాదోపవాదాలు జరిగినవి. గురుకుల విశ్వవిద్యాలయం కావాలని నాగిరెడ్డిగారు గూడ చెప్పారు. అనుబంధ విశ్వవిద్యాలయంగా దీనిని ఏర్పాటుచేస్తే వచ్చే ప్రమాదాలుగాని, వచ్చే కష్టాలుగాని ప్రతిపక్షసభ్యులు సూచించలేదు. ఎంతసేపుచెప్పినా ప్రాంతీయాభిమానం లేవనెత్తి రెచ్చగొట్టుతున్నదనే చెప్పుతున్నారు. వారుచెప్పే వాదంగాని, చేసే సూచనలుగాని చాలా దీర్ఘంగా యోచిస్తే Affiliating University గా చేస్తే వచ్చేప్రమాదం, ఆంధ్రదేశానికిగాని, ప్రభుత్వానికిగాని ఏమీలేదని స్పష్టమగుచున్నది. ముందు residential గా చేసి తరువాత Affiliating University గా చేసుకోవచ్చునని కొందరు చెబుతున్నారు. ప్రభుత్వం యిప్పుడు ఆర్థికమాంద్యములో చిక్కుకొన్నది. కేంద్రప్రభుత్వంవారి ఉత్తర్వులు పొందవలయునన్న ముందుకు ఎంతోకష్టము కలుగును. ఒకప్పుడు వారి ఆమోదముపొందుట అసాధ్యముకావచ్చును. చూస్తే యిప్పుడు Residential గా, University గా ఏర్పాటుచేసుకుంటే అందువల్ల చాలా నష్టంవుంటుంది. చాలా ఇబ్బందులుగూడవుంటాయి. ఈ సంగతి ప్రతిపక్షములోవున్న సభ్యులకు తెలుసును. నాగిరెడ్డిగారు ఒకప్పుడు Affiliating

29th May 1954] [Sri S. Narayanappa]

University రాయలసీమలోవుంటే బాగుంటుందని ఉపన్యాసాలలో చెప్పినసంగతి నాకు తెలుసును.

Sri T. Nagi Reddi — On a point of personal explanation. నేను ఎప్పుడూ అట్లా వుపన్యాసాలు యివ్వలేదు. తిరుపతిలో University ని స్థాపించాలని చెప్పాను. కాబట్టి చెప్పనిది చెప్పినానని చెప్పి, యిటువంటి దుర్భర దురవస్థ కల్గజేయ వద్దని చెప్పుతున్నాను.

Sri S Narayanappa — నేను తప్పకుండా చెబుతాను. ఆ విధమైన అభిప్రాయం చెప్పారని 1935 నుండి 1945 వరకు వారు యిచ్చిన ఉపన్యాసాలు గుర్తుకు తెస్తున్నాను. అనంతపురం కాలేజీవిషయంలో చాలా వుపన్యాసాలు యిచ్చారు. ప్రతిపక్షనాయకులైనతరువాత పార్టీ వారియొక్క ఆమోదం ప్రకారం ఆ అభిప్రాయం యిప్పుడు మార్చుకొనివుండవచ్చును. ఆ విషయాలు తరువాత గుర్తుకువస్తాయి.

Sri T Nagi Reddi — 1935 నుండి 1945 వరకు నేను ఉపన్యాసాలు యివ్వనే లేదు. 1935 లో చదువుకుంటున్నాను 1943 ఆ ప్రాంతములో నేను జైలుకుపోయాను. ఆ తరువాత కలకత్తా వెళ్లాను. అనంతపురం కాలేజీనిగురించి నేను మాట్లాడినప్పుడు అక్కడ Post graduates course లను పెట్టాలనిచెప్పివుంటిని. అంతకుమించి నేను ఏమీ చెప్ప లేదు. రామలింగారెడ్డిగారి రిపోర్టు ఆచరణలోపెట్టాలని చెప్పాను. అంతకుమించి లేని అపాద నలు చెప్పవద్దని కోరుతున్నాను. 1935 మొదలు 1945 వరకు Affiliating University కావాలని నేను చెప్పినట్లు చెప్పుతూవుంటే ఎట్లా? ఆ సంగతి నాకు తెలియదు. అప్పుడు నేను విద్యార్థిగావుండి చదువుకుంటున్నాను.

Sri S. Narayanappa :—పోనీ ఆ విషయం వదిలిపెడదాం. Affiliating University కి ఆమోదంపొందాలి. అందుకు ఇప్పుడువున్న అవకాశాలు మరల రావు. విశ్వవిద్యాలయం కావాలంటే ముందుగా Central యొక్క Financial Commission వారి ఆమోదం తీసుకోవలసివుంటుంది. ఇప్పుడు మనకు అటువంటి అవసరముకూడ లేదని చెబుతున్నాను. ఈ అవకాశాన్ని వుపయోగించుకొని రాయలసీమలో చిరకాలమునుండి వాంఛిస్తున్నటువంటి విశ్వవిద్యాలయమును నెలకొల్పడానికి రాయలసీమప్రజలను సంతృప్తి చేయుటకు ప్రాంతీయ అభిమానాలను కల్పించి అడ్డంకులుకల్గించకుండా విజ్ఞానవికాసములలో వెనుకకు నెట్టబడిన ఈ ప్రాంతంలో వాటిని కలుగజేసి తోడ్పడవలసివున్నది. Affiliating University స్థాపించుట ఆమోదించిన దానియొక్క ఖర్చులకు తగిన ఆదాయము వచ్చు అవకాశాలువున్నవి. గనుక Affiliating University చేసి ప్రజలయొక్క వాంఛితమును నెరవేర్చి ఈ మహాకార్యాన్ని చిరస్థాయిగా చరిత్రలో నిలిపి ఖ్యాతిని గడించుతారని ఆశించుతూ నేను విరమిస్తున్నాను.

Sri G. C. Kondaiah — ఉపాధ్యక్షా! ఈ University అసలు ఎందుకు స్థాపించాలో నాకు ఇప్పటికీకూడ తెలియడంలేదు. ప్రత్యేకంగా మరొక University ని స్థాపించవలసిన అవసరమేమో నాకు బోధపడడంలేదు. ఈ University ప్రయత్నమే లేకుండాయుంటే బాగుంటుందని నా అభిప్రాయము ఉన్న University నే develop చేయలేకుండా ఉండేస్థితిలో క్రొత్త University దేనికొరకో నాకు అర్థంకావడంలేదు. ఉన్న schools కూడ close చేస్తూయుండే ఈ రోజులలో ఒక క్రొత్త University ని ఏర్పాటుచేయాలని అనుకోవడం ఏమాత్రం సమంజసంగాలేదు. పోనీ ఎటూ ఒక University ని start చేయాలనుకొన్నారు. మద్రాసు యూనివర్శిటీలో ఉన్న కాలేజీలను అక్కడనుంచి విడదీసి, తిరుపతి యూనివర్శిటీలో పెట్టుకొంటే బాగనే యుంటుందనుకొంటే, ఇప్పుడు ఆంధ్రయూనివర్శిటీలో ఉన్న నెల్లూరుకాలేజీలను కూడ ఈ క్రొత్త యూనివర్శిటీలో చేర్చాలని ఎందుకనుకొంటున్నారో, అందులో వారి ఉద్దేశ్యమేమో తెలియకుండా ఉన్నది. ఇది ఆంధ్రవిశ్వవిద్యాలయానికి భారమనా లేక education standard గురించా, లేక మరేకారణంచేత ఈ విధంగా చేస్తున్నారో అర్థం కావడంలేదు. ఇదంతాచూస్తే దీనివెనుక ఒక motive ఉన్నదని అర్థం అవుతుంది. లేకపోయినట్లయితే ఇంత అవసరంగా University కావలెనని చెప్పుటకు సరియైన కారణాలు లేవు. దీనిని ప్రభుత్వము సరియైన సమాధాన మివ్వగలిగితే, నా అభిప్రాయము మార్చుకొంటానేమోగాని లేకపోతే దీనికి వేరేకారణం నాకు కన్పడడంలేదు. 1940 లో ఒకతూరి తిరుపతి దేవాలయంలో డబ్బు ఉన్నప్పుడు Residential University గా చేయుటకుగాను 20, 25 లక్షలు ఇస్తామని అన్నారు. అప్పుడు మంత్రిగా ఉండిన కోటిరెడ్డిగారు దిబ్బమీద పెడదామా, దిబ్బక్రింద పెడదామా అనిచెప్పి ఆలోచనచేశారు. అప్పుడు అది కొనసాగలేదు. ఇప్పుడు మరల ఆంధ్రప్రభుత్వము వెంటనే ప్రత్యేకంగా అక్కడ యూనివర్శిటీని స్థాపించాలని అనుకొంటున్నది. ఉండే యూనివర్శిటీలో విద్యావిధానములోగాని education standard లో గాని ఏమైనా లోపము ఉన్నట్లయితే దీనికి అవసరముండేది. అటువంటి దేది కనుపించలేదు. ఇప్పుడు మనరాష్ట్రములో ఎన్నో ముఖ్యమైన ఇతర సమస్యలు బాధిస్తున్నవి. వాటినన్నిటిని వదలిపెట్టి University సమస్యను తీసుకొన్నారు. నూటికి నూరుమందికి సంబంధించిన భూసమస్య ఉన్నది, అదేవిధంగా ఇనాందారు సమస్య ఉన్నది. ఈ సమస్యలను పరిష్కరించడానికి ప్రయత్నించకుండా ఎందుకూ అవసరంలేని University కావాలని పూనుకొంటున్నారంటే చాలా విచారకరంగాయున్నది. ఒకవేళ రాయలసీమవారికి ఇందువల్ల ప్రత్యేకంగా ఏమైన మేలు కలుగజేస్తున్నారాఅంటే అదేమిలేదు. దీనివల్ల వారికికూడ ఏమి లాభముండదు. అటువంటప్పుడు దీనియొక్క అవసరమేమిటో కన్పడలేదు. పోనీ ఎటో దీనికి temple money వస్తుంది. గనుక University ని ఏర్పాటు చేసుకోవచ్చుననుకొంటే, దానికిని Residential University గా develop చేసుకోవచ్చును. ఇప్పుడు Benares and Annamalai Universities ఆ విధంగా వచ్చినవికావా! పోనీ ఇప్పుడు మద్రాసుయూనివర్శిటీలో ఉన్నటువంటి రాయలసీమకాలేజీలను ప్రత్యేకించ

వలసిందేనని అనుకొందాము. కాని, ఆంధ్రయూనివర్శిటీలో ఉన్నటువంటి నెల్లూరుచి విడదీసి కొత్త యూనివర్శిటీలో చేర్చడమంటే అంగీకరించుటకే వీలులేదు. ఈ రెంటికి ఒకగోడ అడ్డముకట్టినట్లు అవుతుంది. కనుక ఈ విధంగాచేయడం సరియైనవిధానంగాదని మనవి చేస్తున్నాను. ఇది ఎన్నో అపోహాలకు, ప్రాంతీయవిభేధాలకు, పార్టీకక్షలకు దారితీస్తుందని చెప్పుచున్నాను. అందుచేత కొత్త యూనివర్శిటీని ఒకదాన్ని start చేయాలని అనుకొన్నట్లయితే Residential University గా మాత్రము ఏర్పాటుచేయండి. కాని నెల్లూరుకు మాత్రము అందులో చేర్చవద్దని కోరుతూ విరమిస్తున్నాను.

Sri Pillalamarri Venkateswarulu — అధ్యక్షా! ఈ విశ్వవిద్యాలయం Affiliating University గా ఉండాలా, లేక Residential University గా ఉండాలా అనేదాంట్లోనే ప్రధానంగా అభిప్రాయభేదం వచ్చింది. మొన్న నాగిరెడ్డిగారు మాట్లాడుతూ ఈ యూనివర్శిటీ విషయంలో అభిప్రాయభేధం ఏవిధంగా వచ్చిందిన్నీ వివరించి చెప్పారు. అంతేకాదు, అసలు యూనివర్శిటీని పెట్టేటప్పుడు చూడవలసిన పరిస్థితులను గురించి క్లుప్తంగా వివరించారు. మేము ఇచ్చిన dissenting minute లో దీన్నిగురించి 'కొందరు వ్యక్తుల అభిప్రాయానికి లొంగి ప్రాంతీయ దురభిమానాలను రెచ్చకొట్టవద్దు రాధాకృష్ణగారి సలహాను త్రోసిపుచ్చవద్దు' అని స్పష్టంగా చెప్పాము.

The Hon. Sri N. Sanjeeva Reddi — రాధాకృష్ణగారి అభిప్రాయాన్ని వ్యతిరేకించడం లేదుగాని, మీరు ఇచ్చే వ్యాఖ్యానమే సరిగాలేదు.

Sri Pillalamarri Venkateswarulu: — ఇప్పటికైనా రాధాకృష్ణగారి అభిప్రాయము తీసుకొంటారా అని అడుగుచున్నాను. రాయలసీమ కళాశాలలను ఆంధ్రవిశ్వవిద్యాలయంలోచేర్చి అక్కడ ఒక sub-centre పెట్టాలని ముందు C R రెడ్డిగారు ప్రయత్నించారు. కాని అది నెరవేరలేదు. కాని ఇప్పుడు ఆంధ్రరాష్ట్రానికి ఒక ముఖ్యనాయకుడుగాను, All-India Congress Working Committee సభ్యుడుగాయుండి దేశంలోని కాంగ్రెసునాయకులలో ముఖ్యుడుగా తయారుకావలసిన సంజీవరెడ్డిగారు కేవలం ఒక రాయలసీమనే దృష్టిలోపెట్టుకొని, ప్రాంతీయదురభిమానాలను, విభేదాలను రెచ్చగొట్టేందుకు ప్రయత్నిస్తున్నారంటే చాలా విచారకరంగాయున్నది. ఆనాడు దీనిని C. R. రెడ్డిగారు ప్రారంభించారు. దానినే సంజీవరెడ్డిలాంటివారు ముందుకు తీసుకొనివచ్చియుంటే ప్రజానీకం చాలా సంతోషించి ఉండేది. ఆ విధంగా రాయలసీమప్రజలను అంతా కలిసిఉంటామని ఒకమాటైన నచ్చజెప్పుటకు ప్రయత్నించారా, లేదు. ఇంకా కోటిరెడ్డిగారికి ఈ యూనివర్శిటీవిషయంలో చాలా సంబంధమున్నది. వారు తిరుపతిలో దీనిని దిబ్బమీద పెడదామా, దిబ్బక్రింద పెడదామా అని ఆలోచించారేకాని, ఇది ఏవిధంగా ఆంధ్రదేశ ఐక్యతకు తోడ్పడుతుందని చూడలేదు. బెజవాడలో ఉన్న University ని తీసుకొనివచ్చి Waltair లో పెట్టడం జరిగింది. మరల ఇప్పుడు ఈ

[Sri Pillalamarri Venkateswarulu] [29th May 1954

విధంగా విడదీయుటకు ప్రయత్నిస్తున్నారు. ముఖ్యంగా ఈ నాడు ఆంధ్రదేశంలో ఉన్నటువంటి పరిస్థితులనుబట్టి ప్రభుత్వము మన ఆంధ్రదేశాన్ని ఐక్యపరచుటకు ఏమాత్రము పూనుకోకుండుట చాలా విచారకరంగాయున్నది నాకు C. R ఆరెడ్డిగారి అభిప్రాయాన్ని, రాధాకృష్ణగారి అభిప్రాయాన్ని వీరు దృష్టిలో ఉంచుకొన్నట్లయితే ఈ విధంగా చేసి యుండరు తిరుపతి దేవస్థానం క్రింద కొన్ని బిల్డింగులు, 40 లక్షలవరకు ఆస్థిపాస్తులు ఉన్నాయి. వాటిని ఉపయోగించి విశ్వవిద్యాలయాన్ని ఏర్పరచి విద్యాభివృద్ధిచేయాలని అనుకోవచ్చును. కాని అలాంటి యూనివర్శిటీ ఏ రూపంలో ఉండాలి? Affiliating University గా ఉండాలా, Residential University గా ఉండాలా అని యోచించవలసియున్నది. ఈ సందర్భమున మన ఆంధ్రదేశములో పరిస్థితులు ఏవిధంగా ఉన్నాయి Capital విషయంలో చాలా తగాదాలు వచ్చాయి ఆ విషయంలో ఎవరిది తప్పో నేను చెప్పలేను. అప్పుడువచ్చిన విభేదాలు, తగాదాలు, ఇంకా పూర్తిగా అణిగి పోలేదు. అటువంటప్పుడు Affiliating University ని మరొకదానిని ప్రత్యేకంగా పెట్టి సమసిపోయిన విభేదాలు మరల లేవనెత్తదలచుకొన్నారా అనిపిస్తుంది. ఈ రోజు చూస్తున్నాము ఈ ప్రాంతీయవిభేదాలు రోజురోజుకు ఎక్కువ అయిపోతున్నాయిగాని తగ్గడంలేదు. అటువంటప్పుడు వీటిని అణచడానికి ప్రయత్నించకుండా మరల ఈ విధముగా లేవనెత్తజూచుట చాలా విచారకరంగాయున్నది. నారాయణప్పగారు మాట్లాడుతూ Affiliating University పెడితే ఆ ప్రాంతములోఉండే కాలేజీల ఆదాయమంతా ఆ యూనివర్శిటీకి వస్తుంది, ప్రభుత్వానికి ఏమి బాధలేకుండా ఉంటుంది అని చెప్పారు.

అట్లాంటప్పుడు ఒక Affiliated University పెట్టినంతమాత్రాన డబ్బువస్తుంది అనేవుద్దేశ్యము కొంతమందికి వున్నది. అయితే ముందుగానే Affiliating University తో ప్రారంభిస్తే, దానికి డబ్బు రావటము చాలకష్టం. ఇదేవుద్దేశ్యముతో శ్రీ రంగధామరావుగారు వారియొక్క కమిటీ రిపోర్టులో, ముందు Affiliating University గా start చేస్తే, దానికి 16 లక్షల రూపాయలు కావలసివుంటుందని వ్రాశారు ఒకవేళ రెండులక్షలు వస్తాయనుకోండి. మిగిలిన డబ్బు ఎక్కడినుంచివస్తుంది? ప్రభుత్వముకూడా కావలసినడబ్బు యివ్వగలదా? అందువల్ల అది ఆ విధంగా ప్రారంభించటానికి వీలుండదు. ఒకలక్షో, రెండులక్షలో వస్తుందిగనుక ముందుగానే Affiliating University ని start చేద్దామనే ఆలోచన మంచిదంటారా? ప్రస్తుతము రాయలసీమవారికి, కోస్తాజిల్లావారికి మధ్య విభేదాలు పెంచటానికి ప్రయత్నాలు జరుగుతున్నవి. ఈ విభేదాలతో విద్యార్థులలో యూనిటీ లేకుండా చెడగొట్టటానికి కృషిచేస్తున్నట్లు కన్పిస్తున్నది. అందువల్ల యీ రెండులక్షలరూపాయలు కూడివస్తే, వేరే ఆలోచన అక్కరలేదు. రెండులక్షలు గ్రాంటును ప్రభుత్వము యిస్తానంటున్నప్పుడు ప్రభుత్వము మరిరెండులక్షలు ఖర్చుచేయడము అంత ఎక్కువ బరువుకాదు. మొట్టమొదటనుంచి యీ బిల్లు ఒకప్రత్యేకపంథాలో తయారుచేయబడ్డది.

ఒకప్రాంతానికి ఒక యూనివర్శిటీని స్థాపించి, దాన్ని అభివృద్ధిచేయటానికి వీలులేకుండా చేసుకోవడముకంటె మరేమిటి ఈ విధానం? అని ప్రశ్నిస్తున్నాను. ఈ రోజున ఆంధ్ర యూనివర్శిటీకి రాష్ట్రవ్యాప్తముగా అన్నిప్రాంతాలనుంచి విరాళాలు వసూలుచేయడము జరుగుచున్నది. ఆదేవిధంగా అధికార్ల co-operation వల్ల వెంకటేశ్వర విశ్వవిద్యాలయాన్ని జయప్రదముగానడపటానికి వీలు అవుతుందని మీరు ఆలోచిస్తున్నారా? మన ఆంధ్రరాష్ట్రము యొక్క ఆర్థికలోటుపరిస్థితులను దృష్టిలోపెట్టుకొని, దానికి విరివిగా ఎక్కువవిరాళాలు వసూలుచేస్తే, అప్పుడు అది Affiliating University, మీరు అనుకొన్నవిధంగా కాజాలదు అని అంటున్నాను. వాస్తవికపరిస్థితులను దృష్టిలోకి తీసుకోవలసిందిగా కోరు చున్నాను. కాబట్టి ఇప్పుడు తిరుపతిలోపెట్టబోయే యీ యూనివర్శిటీ Residential University గా చేస్తే, అప్పుడు అది ఆంధ్రదేశమునకంతటికి ఒక తృప్తికరమైన యూని వర్శిటీగా తయారవుతుందని నా అభిప్రాయము. ఈ యీ సమస్య, ప్రజ సహకారాన్ని కోరేదిగాలేదని గుర్తించాలి. ఇక్కడ కొంతమంది ప్రజాసోషలిస్టుపార్టీ వారు రెండు సంవ త్సరాలపాటు Residential University గా ఉంచాలని అంటున్నారు. ఆటువం టప్పుడు రాయలసీమలోవున్న కళాశాలలు అన్నియు ఏ యూనివర్శిటీకి అనుబంధింప చేయాలి! ఆంధ్రయూనివర్శిటీకి చేర్చుతారా? లేకపోతే మద్రాసులోనేవుంచుతారా! మద్రాసు యూనివర్శిటీలోవున్న ఆంధ్రరాష్ట్రపు కళాశాలలు అన్నికూడా ఆంధ్ర యూనివర్శిటీకి affiliate చేయటానికి అంగీకరిస్తారా! లేదా! దానికి పట్టాభిరామారావు గారు ఏమిసమాధానము చెప్పదలచుకున్నారు? రెండుసంవత్సరాలతరువాత ఏ ఏర్పాటులో యీ కళాశాలలను తీసుకోవాలి? ఏ University కి అనుబంధించివుండాలి? రిపోర్టునుబట్టి చూస్తే అది ఖచ్చితముగా మద్రాసులోనేవుండాలి అని బోధపడుతుంది. ఇటువంటి అభిప్రాయమేగనుక వున్నట్లయితే, దీన్ని వ్యతిరేకించవలసియున్నది. ఆ విధంగాచేస్తే, మన ఆంధ్రదేశఐక్యత ఏమాత్రము దృష్టిలోకిపెట్టుకోకుండా మాట్లాడుతున్నారని అంటున్నాను. ఆటువంటిపరిస్థితి ఏర్పడితే, అప్పుడువచ్చేయిబ్బందులను ఎదుర్కోవలసివుంటుంది. ఒక రాష్ట్రములోవున్న కళాశాలలను మరొకరాష్ట్రములోవున్న University కి అనుబందింప జేసేదస్థితి తెచ్చిపెట్టుకోవడము ఏవిధంగాను మంచిదికాదు. అందువల్ల మద్రాసులో యిప్పుడువున్న కళాశాలలను తక్షణము ఆంధ్రయూనివర్శిటీకి affiliate చేయటానికి పూనుకోవాలి. ఆదేవిధంగా Socialist Party వారు యిచ్చిన సవరణలు ఎక్కడకూడా లేవు. ప్రభుత్వము యింతవరకు దానివిషయములో ఏమీ చెప్పలేదు.

తరువాత తిరుపతియూనివర్శిటీని Residential University గా చేయడము చూస్తే, రంగధామరావుగారు చెప్పినమాటలనుబట్టి teaching personnel విషయములో ఒక అవాంతరము ఏర్పడుతుందని అన్నారు. Residential University అయితే, ఎవరురారని అంటున్నారు. ఈ విషయములో నేనొకటి మనవిచేస్తున్నాను. రాయలసీమలో వున్న Colleges అన్నీ affiliate చేస్తూ యూనివర్శిటీ ఏర్పాటుచేస్తే, అప్పుడు

[Sri Pillalamarri Venkateswarulu] [29th May 1954

teaching personnel ఎక్కడనుంచి వస్తారు? లేకపోతే ఇతరరాష్ట్రాలనుంచి మనము వారిని తెచ్చుకోలేమా? ఇతర రాష్ట్రాలవారికి మనయొక్క పరిస్థితులను నచ్చచెప్పి, మనము వారిని తెచ్చుకోటానికి ప్రయత్నించాలి. కాని teaching personnel దొరకటము కష్టము అనడములో విలువలేదు.

మరొకవిషయము చెబుతున్నాను. ఈరోజున రాయలసీమలోని కళాశాలలు affiliate చేయకుండాపోతే, Courses of instruction ఒక basis గా తీసుకొని instruction యిస్తే మంచిదని అంటున్నారు అట్లాంటప్పుడు ఆంధ్రదేశమంతటికిని ఆ పద్ధతి ఒక basisగా తీసుకురావాలి. ఇప్పుడు యీ తిరుపతియూనివర్శిటీ Residential University గా చేస్తే ఏ ఏ courses కు పునాది అనేది తేల్చుకొని అన్ని కళాశాలలలోను ఆ courses ఏర్పాటుచేయటానికి అధికారము వుంటుందిగనుక, ఒక తిరుపతికాలేజి నుంచి ఏ కొద్దిమందో వుంటారు గనుక, ఆ విధంగాచేస్తే అంత బాధవుండదు. గనుక ఆ విధంగా చేయాలిగాని, అంతకంటె వేరుమార్గము కనబడదు. ఈ విధంగాచేస్తే సర్వీసుకాదు, affiliate చేస్తే సర్వీసు అని అనుకోవడము పొరబాటు. ఈ విధంగాచేస్తే నష్టమేమిటి అని అడుగుతున్నాను. సుబ్బారెడ్డిగారు చెప్పిందికూడా జాగ్రత్తగా పరిశీలించాలని అంటున్నాము. ఇప్పుడు మన educational standards దృష్టిలో పెట్టుకోవలసి యున్నది. ఆంధ్రదేశములో educational standard పెంచవలసియున్నది. డాక్టరు కృష్ణాగారు యిచ్చిన రిపోర్టులోకూడా ఆ అభిప్రాయము వెలిబుచ్చలేదుకాని, కొంతమంది మిత్రులుమాత్రము ఆ విధంగా చెప్పారు. ఆంధ్రయూనివర్శిటీ యిప్పుడు ఖర్చు భరించ లేకుండాయున్నది. ఖర్చులు విపరీతంగా పెరిగిపోయినవి. కాని అది సరికాదని నా అభిప్రాయము.

సంజీవరెడ్డిగారు కోపము తెచ్చుకోకుండావుంటే, ఒకవిషయము చెబుతాను. వారు యీ యూనివర్శిటీవిషయములో ఒక statement యిచ్చారు. ప్రకాశంపంతులుగారు కూడా స్టేటుమెంటు యిచ్చారు. ఈ statements యీ యిద్దరిలో ఎవరు ఏవిధంగా యిచ్చారో తెలియదుగాని, ఒకరు Affiliating University చేయాలని, యింకొకరు Residential University చేయాలని యిచ్చారు. వీరిద్దరిమధ్య, పట్టాభిరామారావు గారు దీనికిసంబంధించిన ఫైలు చేతపుచ్చుకొని యీ చివరికి ఆ చివరికి తిరగడము జరుగుతున్నది. కాని యీ సమస్య ఏ విధంగా పరిష్కారముచేయబోతారో తెలుసుకోవలసి యున్నది. ఇప్పుడు ruling party లో పెద్దవారుగావున్నవారే దాన్ని పరిష్కరించగల రని సుబ్బారెడ్డిగారు అంటున్నారు. ఆ విధంగావుంటే, కమిటీవారు మరొకవిధంగా ఎందుకు వ్రాశారని అడుగుతున్నాను.

**The Hon. Sri T. Viswanatham**:—In the Select Committee, Dr. Rao read out extracts from paragraph 8 of the Report of the Expert Committee. He pointed out that the Committee has examined

the question with an absolutely open mind in all aspects purely from an academic point and came to the ultimate conclusion that from a practical point of view, it would be best that the new University should be of a residential, teaching and affiliating type.

అందుచేత మిగిలిన ఆరోపణలు చేయకుండా వుండేటట్లు చూచుకోవాలి.

Sri Pillalamarri Venkateswarlu — విశ్వనాథంగారు expert committee report లోని విషయము చెబుతున్నానని అంటారు. మేము ఏదైన చెబుతున్నప్పుడు అవి త్రోసివేస్తారు.

The Hon Sri T. Viswanatham — నేనుకూడ కమిటీరిపోర్టులోనిదే చదివిచెప్పాను. ఒకసారి ఆ సెలెక్టుకమిటీరిపోర్టు చదివి కొంచెము జ్ఞాకముచేసుకుంటే మంచిది.

Sri Pillalamarri Venkateswarlu — విశ్వనాథంగారు ప్లీడరువృత్తి మానివేసినన్నూ, యింకా వారి ప్లీడరుపోకడలు మాత్రము విడిచిపెట్టలేదు, రిపోర్టులోని 3 వ పేజీలో 6 వ ప్యారాగ్రాఫుతీసుకొని చదువుచున్నాను.

"If we were free to suggest proceeding at a pace that would be academically sound, we would suggest starting an Honours College at Tirupathi and building it up for three or four years before we convert it into a teaching University.

నేను ఇందులోవున్నది చదివినాను.

The Hon. Sri N. Sanjeeva Reddi — Elementary School లో A. B. C. D. లు చదువుకుంటాము. కాలేజీలకు వెళ్లినప్పుడు B. A, M. A. చదువుకోటానికి వీలు అవుతుంది.

Sri T. Nagi Reddi.— అసలు ప్రభుత్వంవారు ఒక అభిప్రాయానికి వచ్చిన తరువాత తిరిగి దానిని మార్చుకోవటం జరిగింది. వారొకవిధంగా వొప్పుకొని తిరిగి యెందుకని Affiliating University కావాలని అంటున్నారో ఆ point నాకు అర్థంకావటం లేదు. ప్రభుత్వమువారు ఆవిధంగా నిర్ణయించవలసినదని చెప్పినట్లు వారు రిపోర్టులో చెప్పారు. వారా నిర్ణయాన్ని స్పష్టంగా చెప్పినట్లు తెలుస్తున్నది. కాబట్టి యిక్కడ నిర్ణయం ప్రభుత్వ నిర్ణయాన్నిబట్టి జరిగిందని మా అభిప్రాయం.

Sri Pillalamarri Venkateswarlu :— అందువల్లనే శ్రీ సంజీవరెడ్డిగారు, శ్రీ పట్టాభిరామారావుగారు, శ్రీ ప్రకాశంగారు వారిలోవారికి అభిప్రాయభేదం రావటంవల్ల కమిటీరిపోర్టు ఆవిధంగా తెచ్చి Select Committee వేసి proceedings తరువాత యీ బిల్లును తీసుకువచ్చారు. ఇవన్నీ దృష్టిలో పెట్టుకొన్నట్లయితే అసలు ప్రభుత్వముముందే ఒక అభిప్రాయానికి వచ్చిందని తెలుస్తున్నది. దానికి సంబంధించి ఒక కమిటీని వేసింది. ఆ కమిటీ

ఒక report యిచ్చింది. అందులో వారి అభిప్రాయము వారు చెప్పారు. అసలు Residential University ప్రాముఖ్యతను గురించి అది best అనిచెప్పారు వారు అది దాని substance. ఏపరిస్థితులలో యీ report యెట్లావచ్చిందీ ఆలోచించమని కోరుతున్నాను. ఈ పరిస్థితులనన్నిటినీ దృష్టిలో పెట్టుకొని యీ రోజున దీనిని Residential University గా చేద్దామ లేదా అని ఆలోచించండి. నిజంగా మీరు రాయలసీమప్రజలయొక్క అభిప్రాయాన్నికూడ గట్టుకోవటమే అయితే యిది ఆరాయలసీమ ప్రజలకే వదలిపెట్టండి. అందుకు వారి అభిప్రాయము తెలుసుకొనుటకు మన students అందరికీ అట్టి అవకాశము యివ్వమని విజ్ఞప్తిచేస్తున్నాను. అప్పుడు వారు Affiliating University కావాలంటారో Residential University కావాలంటారో లేక Affiliating-cum-residential University కావాలంటారో లేక ముందే Residential University కావాలంటారో చూద్దాము. వారు తప్పకుండా Residential University కావాలంటారు. లేక Affiliating University కావాలంటారా! అవిధంగానే చేద్దాము. అప్పుడువచ్చిన పరిస్థితులు అనుకూలంగావుంటె తిరిగి Residential University గా start చేద్దాము ఇంకా అధ్వాన్నపరిస్థితి వస్తే అప్పుడే మార్చుకోవచ్చు. అట్లా మార్చుకోకూడదని శ్రీసంజీవరెడ్డిగారికి వుంటే వుండవచ్చు అందువల్ల తప్పనిసరి పరిస్థితులు యేమైనా వచ్చినప్పుడు మనమంతాకలసి ఆంధ్రదేశాన్ని unify చేయుటకు ప్రయత్నించక ముందే రాయలసీమప్రజల అభిప్రాయానికి విరుద్ధంగా Affiliating University పెడితే, (Interruption)

The Hon. Sri N. Sanjiva Reddi — మీరుచెప్పే సలహా బాగానేవుంది. అది P. S. P. వారి amendment కు దగ్గరగావుంది. వారు మొదట్లో యిది Residential University గా వుండి, తరువాత Colleges ను అన్నిటినీ అభివృద్ధిచేసిన తరువాత Affiliating University గా చేయండని చెప్పారు. వారి amendments వున్నవి. శ్రీ M. V. సుబ్బారెడ్డిగారి amendment వున్నది. దానినిబట్టి వారితో యేకీభవిస్తున్నారని భావించుకోవాలా?

Sri Pillalamarri Venkateswarulu :— ముందు Residential University గా చేసి, తరువాత మద్రాసులోవున్న colleges ను disaffiliate చేసి తీసుకువద్దామని, తరువాత Affiliating University గా చేయాలని వారు చెప్పారు. మద్రాసులోవున్న మొత్తం colleges ను అన్నిటినీ ఒకే University క్రింద తీసుకువచ్చి, అప్పుడు అభివృద్ధి యొక్క వచేయుటయు పరిస్థితిని create చేద్దాము. అక్కడ తిరుపతి దేవస్థానముయొక్క డబ్బుతో యీ University ని కొంత అభివృద్ధి చేయవచ్చో అంతా ప్రయత్నం చేద్దాము. అందుకు Dr. Krishna గారిని మొదట్లో రాయలసీమను సంతరించి. వారు చేయవలసిన పని అంతా చేయుటకు పూర్తి అవకాశం యివ్వండి. అందుకు [illegible] ప్రయత్నించేద్దాము. ఆ విధంగా పూర్తి అవకాశము యిచ్చుటకు, అందుకు

శ్రీ సంజీవరెడ్డిగారిని ఆలోచించమని కోరుతున్నాను. P S P వారు యిచ్చిన amendment ప్రకారంచేస్తే చాలా ప్రమాదం వుందని చెప్తున్నాను. అసలు రాయలసీమ colleges ను మొట్టమొదట మద్రాసులో వుంచటమా? లేక ఆంధ్రా యూనివర్సిటీలో వుంచటమా అనేది ముందునిర్ణయించవలసిన విషయం అందువల్ల P S P వారి suggestion చాలా ప్రమాదమైనది. అందువల్ల ఆ suggestion ను అంగీకరించటం చాలా నష్టదాయకము. శ్రీసంజీవరెడ్డిగారు residential University పెడతామనే ఆయుధంతో రాయలసీమలో ప్రచారంచేసి వారి party ని బలపర్చుకొనుటకు ప్రత్నంచేశారు. ఇప్పుడు వారు ఆ అభిప్రాయాన్ని మార్చుకొన్నారు. రాయలసీమ విద్యార్థులంతాకూడా ఒకే University క్రిందవుండే అవకాశము వారికెందుకు యివ్వరు? రామలసీమ colleges ను అభివృద్ధిచేయడానికి పూనుకోవాలి. Degree Courses ను ఆ colleges లో అభివృద్ధిచేయుటకు పూనుకోవాలని చెపుతూ, అందువల్ల దీనిని జాగ్రత్తగా ఆలోచించమని కోరుతున్నాను. లేదా తొందరపడిచేశారా అట్టిదాని ఫలితానికి గురి కావలసివస్తుందని, దాని ప్రతిఫలం తప్పనిసరిగా అనుభవించవలసివస్తుందని హెచ్చరిస్తున్నాను. కాబట్టి P S. P వారి amendment చాలా ప్రమాదకరమని అందువల్ల దానిని residential University గా మార్చాలని కోరుతున్నాను.

The Hon Sri T Prakasam — నేను, ఈ బిల్లుమీద మాట్లాడకుండానే మీరు ముగించివేస్తారని కూర్చుని వింటూవున్నాను. అయితే చిట్టచివరకు మాట్లాడవలసిన పరిస్థితులు యేర్పరచారు అందులో శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లుగారు ఎక్కడో కూర్చుని యీముగ్గురు ఆలోచించిచేశారని మమ్ములను ఉద్దేశించి అన్నారు. నేను ఆ ఆలోచించిన వారిలో ముఖ్యుడుగా వున్నాను. అందులో సందేహం యేమీలేదు. ఈ తిరుపతి విశ్వవిద్యాలయం అనే సంగతి యీనాటి సంగతికాదు 60 యేండ్లపైన అయింది అనుకొంటాను. C. R. Reddi గారు England లో చదువుకొంటూవున్నారు ఆ రోజులలో ఆయన చదువుకొంటూవున్నప్పుడు నేను యిక్కడినుంచి Barrister Course చదవాలని పోయాను. సుమారు ఇది 1903-వ సంవత్సరములో అన్నమాట. ఆ C. R. రెడ్డిగారు Cambridge University students లో అగ్రస్థానంపొందారు. పొంది వారందరికి నాయకుడై పెద్ద పరీక్షలో గెలిచారు. అతనిని మన ఆంధ్రులు, యింగ్లీషువాళ్లలోనే కాకుండా అతను అందరిలోకీ గట్టివాడని అతనిని మన్నించి పూజచేస్తూ వచ్చారు. అటువంటి C.R. Reddi గారు అక్కడ Cambridge Universityలో చదువుతూ London కు వచ్చి అక్కడ Law College లో చదివి Barrister Course కు కూడా తయారైనాడు. అన్నిపరీక్షలలో pass అయ్యాడు. ఆఖరుపరీక్ష pass అయినప్పుడు అతను ఒక పెుండిపట్టుకట్టి "నేను Barrister కాను, Lawyer పని చేయను నేను నా board తీసిపెట్టుతాను." అని అన్నాడు. తరువాత ఆయన మనదేశములోకి వచ్చారు. అనేకచోట్ల పనిచేశారు. గొప్ప విశేషమైన బోధనలు చేశారు. ఆ C. R. Reddi యీరోజున

[The Hon. Sri T. Prakasam] [29th May 1954

ఇక్కడ వున్నట్లయితే ఆయన ఇలాగ ఆలోచించివుంటాడా? శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు గారు, శ్రీ నాగిరెడ్డిగారు మిగిలినవారు అంతాకూడా Residential University అంటే ఏమిటి? Affiliated University అంటే ఏమిటి? అని చెప్పి మూడురోజులనుంచీ చర్చ చేస్తూవచ్చారు.

Affiliating University ప్రజలకు పనికిరాదు, Residential University అందరికీ పనికివస్తుందని వారు వాదిస్తున్నారు. అది నాకు చాలాసంతోషం. నేనుకూడా మీలాగే Residential University అయినా, ఏ University అయినా స్థాపించుకోవాలని చెప్పేవాడిని. ఈ తిరుపతి యూనివర్శిటీ విషయంలోకూడా Residential University గా ఉంటే బాగుంటుందని చెప్పి అన్నాను. కాని దాన్నిగురించి నాకంటె అనుభవజ్ఞులైనవాళ్లు బుద్ధిమంతులు C R Reddi అంటివాళ్లు వాళ్లయొక్క అనుభవంమీద చెప్పారు. నేను C R. Reddi తో కలుసుకొని మాట్లాడానని చెప్పితే అది ఎప్పడిదో 50 ఏళ్లనాటి మాట ఆతను ఏమిచెప్పాడో అదికూడా మీకు చెప్పాను ఎవరు ఏదిచెప్పినా ఈ విద్యావిధానమంటే మీరంతాకూడా చాలా తీవ్రంగా వాదిస్తున్నారు. అది Affiliating విద్యాలయమా లేక Residential విద్యాలయమా అని చాలా లోతుగా పోతున్నారు. కాని Residential University లో ఉన్న లాభం Affiliating University లో ఉన్ననష్టం ఏమిటో ఎవరైనా చెప్తారా అని నేను ఎంతో ఆదుర్దాతో కూర్చున్నాను. మీరు కొంతవరకు చెప్పింది విన్నాను. కాబట్టి ఇప్పుడు నేను చెప్పేదికూడా మీరు వినండి. ఇందులో ఏది ఎక్కువ అనేది తెల్పవలసి ఉంది. ఇప్పుడు ఈ University అనేది నేనూ కావాలని చెపుతున్నాను, మీరూ కావాలని చెపుతున్నారు. ఇప్పుడు మీరు Affiliating University పెట్టవద్దని Residential University పెట్టమని చెపుతున్నారు. మనదేశంలో ఉన్న Residential University ల్లో బెనారెస్‌లో ఉన్న పండిత మదనమోహన మాలవ్యాకట్టిన Residential University ఆయన ఏవిధంగా కట్టాడో. నేను ఆ యూనివర్శిటీలో కూర్చొని చదివినవాడిని కాకపోయినా, అవన్నీ గ్రహించుకుంటూ వస్తున్నాను. (Interruption) ఈ కె. రాజగోపాల రావు చిన్నతనం నుంచీకూడా నాకు బాగా తెలుసు. ఇక్కడ ఉన్నవాళ్లంతాకూడా కాంగ్రెస్‌లో నుంచి వచ్చినవాళ్లే. తరవాత నెమ్మదినెమ్మదిగా తప్పుకొన్నారు. ఈరాజగోపాలరావు ఒకప్పుడు మీటింగులో speech ఇస్తుంటే అవన్నీ వింటూవచ్చాను. ఇప్పుడు విశాలాంధ్ర పేపరుకు ఎడిటర్‌గా ఉంటున్నవాడు, ఏవిధంగా యూనివర్శిటీ ఉండాలనే దానిమీద ఏమైనా చెప్తాడని ఆశించాను. ఇదివరకు మీరు చెప్పిందంతా విన్నాను. Residential University లో చదువు ఎట్లా ఉంటుంది? బోధన ఎట్లా ఉంటుంది? పిల్లలకుబోధిస్తే వాళ్లు ఎలా పరిణమిస్తారు? అనే విషయంగురించి పుల్లారెడ్డి, నాగిరెడ్డి, C. V. K. Rao మొదలైనవాళ్లు చెప్పి ఉండవలసింది. దాన్నిగురించి ఏమైనా మీదగ్గరనుంచి కొంచెం నేర్చుకుందామనే ఉద్దేశంతో ప్రొద్దున్ననుంచి సాయంత్రందాకా వింటూ కూర్చున్నాను.

నేను Residential University లో చదువుకున్నవాణ్ణి కాకపోయినా ఆ విద్యను గురించి నాకూ తెలుసు Residential University లో చదువుకొంటే, అందులోనుంచి బైటికివచ్చినా మేముచదువుకున్నవిద్య ఉపయోగపడ తుంది, దానివల్ల ఫలితం ఉంది, అని ప్రజలకు చెప్పుకొనేలాగ ఉండాలి. ఆవిధమైనవిద్య Residential Universities లో పూర్వం నేర్పుతూవచ్చారు అలాంటి Residential University లలో విద్యనేర్చుకొన్నవాళ్లు బైటికివచ్చి ఆ Universities లో నేర్చుకొన్నవిద్యను ఎలాగ వుపయోగించారో మనవి చేస్తున్నాను. ఇదివరకు ఇతరదేశములనుంచి మనదేశానికి దిగుమతి అయేటటువంటి కొన్ని కొన్ని సామానులు రాకుండాపోయాయి. అపుడు ఒకడు Benares University లో విద్యనేర్చుకొని అక్కడ పరీక్షపాసయాడు, తరువాత యింటికివచ్చాడు; వచ్చి అక్కడ చదువుకొన్నవిద్యను ఏలాగ ఉపయోగపర్చాలి? ఇపుడేమిచేయాలి, అని ఆలోచించి ఏమిచేశాడంటే; అపుడు అతనిదగ్గర ఏంచేయటానికి దగ్గర డబ్బులేదు. డబ్బున్నవాడిని ఒకణ్ణి సంపాదించుకొన్నాడు, వాళ్లిద్దరూకలిసి నిడదవోలులో ఒక చిన్నపని పెట్టారు. అదేమిటంటే యుద్ధకాలంలో పైనుంచి ఏమీ రాకుండాఉండేటైమ్‌లో, వాళ్లు అక్కడ ఉప్పును తయారుచేస్తున్నారు. ఆ విషయం నాకు ఎవరోచెప్తే నేను అదేమిటో చూద్దామని చెప్పిపోయాను. వాళ్లు అపుడేమిచేస్తున్నారంటే, అక్కడ రెండు తాటాకుపాకలు ఉన్నాయి, ఒకపాకలో అయిపోయిన, ఎండిపోయిన అరటిగెలలు; అవి రెండవపాకలో చూస్తే అక్కడ అన్నీ పొగాకుకాడలున్నాయి, వాటన్నిటినీ Raw material గా stock చేశారు. మరొకపాకలో రెండింటినీ పొయ్యిమీదపెట్టి కాల్చి దానిని ఉప్పు చేసేవారు. ఆ కాలంలో పైనుంచి ఉప్పు ఇక్కడికి రాకుండావుంది. వాళ్లు దానిని ఉప్పుగా చేసి బజారులోపెట్టారు. ఆ రోజున నేను చెప్పాను, మీరు చాలా ధనవంతులౌతారని; అలాగే ఈ రోజున వాళ్లుకూడా డబ్బుసంపాదించుకొని పెద్దమిద్దెలు, మేడలు అన్నీ సంపాదించుకొని పెద్ద company ని పెట్టుకొన్నారు. Residential Universityలో నేర్చుకొన్నవిద్య బైటికివచ్చినతరువాత ఉపయోగపడుతుంది. అదే అసలు Residential University చదువంటే. మిగతాకాలేజీలలో చదువైతే బైటికివచ్చినతరువాత ఎందుకూ ఆ విద్య పనికిరాదు. Residential University లో నేర్చుకొన్న విద్యఅయితే బైటికి వచ్చి నేను నేర్చుకొన్నవిద్య ఈ విధంగా సద్వినియోగపడుతోంది అని ఉపయోగపరచి చూపించవచ్చును. అంతేకాని మిగతా యూనివర్శిటీలలో నేర్చుకొన్నవిద్య బైటికివచ్చిన తరువాత ఏమాత్రం ఉపయోగపడదు. Residential University చదువు అంటే ఈ విధంగా ఉండాలి.

Sri T. Nagi Reddi :— అందుకనే మేము Residential University కావాలని అన్నాము Affiliating University కావాలని మీరంటున్నారు.

The Hon. Sri T. Prakasam .— దానికి నేనూ యిష్టపడలేదు. అపుడు వాడు నన్నడిగితే నేను Residential University అయితేనే బాగుంటుందనిచెప్పాను.

[The Hon. Sri T. Prakasam] [29th May 1954

నాగిరెడ్డిగారు Residential University కావాలని చెప్పామంటున్నారు. నేనూ Residential University కావాలన్నాను నాగిరెడ్డిగారుకూడా Residential University లోనే చదువుకున్నాడు. ఆయన కమ్యూనిష్టు అయినతరువాత చదువుకోనే అవసరంలేకపోయింది నేను చెప్పిన మోస్తరు విద్యను Residential University లో నేర్చుకోనే అవకాశం ఎప్పుడూకూడా ఆయనకు కల్గలేదు అసలు నేను చెప్పిన మోస్తరు విద్య కాశీవిశ్వవిద్యాలయంలో నేర్పబడుతుంది. ఆ విశ్వవిద్యాలయాన్ని స్థాపించి అంత అభివృద్ధికితీసుకురావడానికి మదనమోహనమాలవ్యాగారు ఎంతో శ్రమపడ్డారు. ఒకసారి ఆయనతోవెళ్లి నేను ఆ విశ్వవిద్యాలయాన్ని చూచాను ఆ విశ్వవిద్యాలయంలో నేర్చుకొన్న విద్య ఆ విశ్వవిద్యాలయంనుంచి బయటికివచ్చినతరువాత ఆ విద్య ఉపయోగపరచుకోనేది లాగ ఉండాలి. అంతేకాని, మీరుచెప్పిన Residential University విద్యనుగురించి ఆలోచించిచూస్తే అది నాకు చాలా ఆశ్చర్యంగా ఉంది. Residential University అంటే ఏమిటో అదెట్లాగ ఉండాలో, దానిలో నేర్పేవిద్య ఎలాగఉండాలో అంటే ఒకరుకూడా ఆవిషయం చెప్పరు. అటువంటివిద్యను ఎవరైనా నేర్చుకున్నారా? అంటే, ఆ ఎవరికీ తెలియనే తెలీదు. అదెలాగ ఉపయోగపడుతుందో తెలియదు. అటువంటిదేమీ లేకుండా మీరు Residential University ఉండాలి అని చెప్తూకూర్చుంటే యింక దాని అర్థం ఏమిటో చెప్పండి. ఆవిద్య ఎలాగ ఉండాలో, Residential University ఎలాగ ఉండాలో చెప్పండి. చెప్పి అందరినీ ఒప్పించండి. అంతేకాని Residential University కావాలి అనిచెప్తూ వచ్చినంతమాత్రాన ఏమీ ప్రయోజనంలేదు. నేనుకూడా ఆంధ్రయూనివర్శిటీ Vice-chancellor గారితో Residential University ఉండాలని చెప్పాను. వారుమాత్రం దానికి ఒప్పుకోలేదు. వారు residential గా ఉండకూడదని చెప్పి సలహాయిచ్చారు. వారు ప్రఖ్యాత విద్యావేత్త అయినటువంటి కట్టమంచి రామలింగారెడ్డిగారిదగ్గర తయారైనవారు. కనుక వారు చెప్పిన దానినిగురించి ఆలోచించకుండా మనం కాదనడానికి వీలులేదు. వారికి ఈ విద్యారంగంలో ఉన్న service లో మనకు కొంతభాగమయినా లేదు. C R. Reddi గారు చాలా పెద్ద పెద్దసిద్ధాంతాలను కనిపెట్టారు. అటువంటి ఆయనవద్ద వీరంతా తయారయ్యారు. అలాంటప్పుడు వీరుచెప్పినవి మనం త్రోసివేయడానికి వీలులేదు. వారిని పూర్తిగా నమ్మడానికి వీలులేదనే సందేహం నాకు ఉన్నప్పటికి వారుచెప్పిన points కు ఒప్పుకోవలసివస్తున్నది.

Sri Pillalamarri Venkateswarulu :— అయితే మీరు మీ అభిప్రాయం ప్రకారం Residential University నే ఏర్పాటుచేయండి.

The Hon. Sri T. Prakasam :—మీరంతా Residential University కావాలి, కావాలి అని చెప్తూంటారు. అంతేకాని, అసలు Residential University విద్య ఎలా ఉండాలో, University నుంచి బైటికివస్తే అది ఏ విధంగా ఉపయోగపడేదిగా

ఉండాలో మీ రెవ్వరూ గుర్తించడంలేదు. కాలేజీనుంచి బైటికివచ్చినతరువాత విద్యార్థి ఊరికే పనిలేకుండాకూర్చొని, గుమాస్తా ఉద్యోగాన్ని సంపాదించడానికికూడా చాలా కష్టపడి తిరుగుతున్నాడు ఇప్పుడుకూడా దొరకడంలేదు. ఏ University నుంచి అయితే విద్యనేర్చి తయారై వచ్చినవాడు ఆ విద్యను నేను ఉపయోగపర్చి, నా ప్రజలకు ఉపయోగ పరచుచున్నాను అని నిరూపించితేనే, అది Residential University విద్య. దీనిని గురించి ఊరికే మీతో వాదంపెట్టుకోదలచలేదు.

Sri C. Pulla Reddi — బ్రహ్మాండమైన University గా తయారు చేసుకుందామని నేను చెప్తున్నాను...

The Hon Sri T Prakasam — ఒకటిచేయాలని చెప్తున్నాను. నేను చెప్పేది ఊరికే మాటలకు చెప్తున్నదికాదిది. నిజంగా Residential University అంటే దానికి కోట్లకొలదిడబ్బు ఖర్చుపెట్టి వృద్ధిచేసుకోవాలి. సరైనపద్ధతిలో ఈ రెండవ University ని మనం start చేసి, కష్టంలేకుండా దీనిని క్రమక్రమంగా అందులో అన్ని విధములైన విద్యను, బయటికిపోయినతరువాత విద్యార్థికి ఉపయోగపడే విద్యాబోధన, ప్రవేశపెట్టి దానిని అభివృద్ధిలోనికితీసుకురావడానికి మనమంతా ప్రయత్నించాలి.

Residential University. పెడుతున్నాం అన్నప్పటికీకూడా అనేక ఆటంకాలు వచ్చాయి, రూల్సువచ్చాయి, నేను ఎరగనటువంటి రూల్సు అంతాకూడా statutory గా వచ్చివున్నాయి. వాటిని వుపయోగపరచుకొని వాటిద్వారా యీ యూనివర్శిటీ ఏర్పాటు చేసుకుని పనిచేసుకున్నతరువాత దానిలో ఒకటిరెండు ఏండ్లు పోయినతరువాత ఇతర కాలేజీలను దానికి కలిపితే పోతుందని చెబితే ఆక్షేపనచేయవలసినటువంటి వ్యవహారం కాదిది. మీరూ నేనూకూడా మనయిండ్లలో చేసుకునేదే. ఆ పూటకు శక్తిలేకపోతే వున్నశక్తితో పనిచేసు కున్న తరువాత మిగతాది తరువాత చేసుకుంటాం. ఆటువంటిదే యిది. అందుచేత ఆక్షేపించ వలసిన సంగతి కాదిది మనకు ఎన్నిపోయినా, బుద్ధి నశించిపోలేదు. బుద్ధివున్నదికనుక ఆ బుద్ధి వుపయోగించి యీ మోస్తరుగావుంటే మంచిదని చెబుతూవుంటే ఆ ప్రకారంగా జరపాలని చెప్పడం మంచిదని అని చెప్పవలసిన duty నామీదవున్నదని నేను ఖండితంగా చెబుతున్నాను. నా యింట్లోవుండే పిల్లలను ఏదోఒక చదువు చదువుకుని వుపయోగంచేసికొని, మిగిలిన వారికి సహాయపడాలని కోరుతాను. కాని మద్రాసులోపెట్టిన బిల్లులాంటిదికాదు. సాయంత్రమో పొద్దున్నో బడిపెడితే సరిపోతుందనే బిల్లులాంటిదికాదు.

ఈ బిల్లు పిల్లలలోని ఐక్యతను చెడగొట్టడానికి వుద్దేశించిందని అంటున్నారు. మీరు యీమధ్య లాయర్లకంటె ఎక్కువగా ఆతట్టునున్నది యీ తట్టు, ఈ తట్టునున్నది ఆతట్టు వాదించే శక్తి సంపాదించుకున్నారు కనుక చెబుతున్నారు గాని అంతకంటె విశేషం యేమీ లేదు. న్యాయంప్రకారంగా వుండవలసినటువంటి పద్ధతి యేమిటో ఆ ప్రకారంగా యీ బిల్లు తయారయినది. ఇక్కడవున్న శాసనసభ్యులలో ఇంగ్లీషురానివాళ్లందరను అడిగితే తమ బిడ్డలు ఒక చోటికిపోయి B. A. పాసుఅయి బానిసపనిచేసేవానికన్న తమపొలంలో పంటపండించే

విధానం నేర్పేవిద్య కావలంటారు. ఆమో స్తరుగా ఆలోచించాలిగాని వాదనకోసం వారు ఆమాట అన్నారుకదా అని వీరు యింకోమాట అనడం కాలయాపనతప్ప యింకేమీ కాదు. మనవిచేస్తున్నానో మీతో ఏకీభవిస్తున్నప్పటికీ కూడా, మీ సహాయంతో ఎలాగో ఒకలాగ పని చేస్తూవుండగా మీరు తలక్రిందులు చేస్తున్నారు. ఇప్పుడు తిరుపతిలో పెడుతున్నది paper University కాదు. మీరు సరిగా తెలుసుకుంటే ప్రపంచంలోవుండే యూనివర్శిటీ లన్నిటిలో కంటే తిరుపతిలో ఏర్పరచబోయే యూనివర్శిటీ గొప్ప యూనివర్శిటీగా ఏర్పడుతుంది అని చెబుతున్నాను. నేను 50 ఏండ్లక్రితం C R రెడ్డిగారితో కేంబ్రిడ్జి యూనివర్శిటీ, ఆక్సుఫర్డు యూనివర్శిటీ చూచాను. London University చూచాను. అవన్ని చూచినతరువాత ఇక్కడ కూర్చున్న మనకు సాధారణంగా ప్రపంచంలో ఎవరికీ కలుగనటువంటి అవకాశం కలిగింది. దానిని పరీక్ష చేసి వెనుకాముందూ సమస్తం ఆలోచిస్తాం. సిల్లలమర్రి వెంకటేశ్వర్లు సైన్సు apply చేస్తాం అన్నారు. సైన్సు apply చేయమనే కోరుతాను. ఆక్షేపణలేదు. కాని యిక్కడవున్న బిల్లుచూస్తే కేంబ్రిడ్జి యూనివర్శిటీ చూస్తే, ఆక్సుఫర్డు యూనివర్శిటీ చూస్తే, లండను యూనివర్శిటీ చూస్తే యిక్కడ పెట్టబోయే యూనివర్శిటీ ఎటువంటిదో కనబడుతుంది 1914 సంవత్సరంలో T. V శేషగిరి అయ్యరు అనే హైకోర్టుజడ్జీ వున్నాడు. లాకాలేజీలో Teacher గా వుండేవాడు. ఆయన తిరుపతిలో కాలేజీలు పెట్టవలసినదిగా ఒకబిల్లు తయారు చేశాడు. తరువాత సదాశివయ్యరు, ఆయన పెద్ద social reformer,—T.V శేషగిరి అయ్యరు orthodox గాని సదాశివయ్యరు ఆటువంటివారుకాదు, దానికి ఒకబిల్లు పెట్టాడు 1925 సంవత్సరంలో. ఈ మధ్యవచ్చిన మహానుభావులు, ఈ Chief justice లు, వున్నదికూడా లాగిపారేశారు ఈతట్టు, బళ్లారి ఆతట్టు బరంపురం యీతట్టు మనకు కాకుండా అన్యాయం జరిగింది. బళ్లారి విషయం ఏమి రాశారో చూసుకోండి.

ఇప్పుడు కమిషను వేస్తూవున్నారు, మనం యిప్పుడు అందరినీకూడ గట్టుకుని తీసుకు రావలసిన time వస్తున్నది. ఐక్యత చెడిపోకూడదు. ఐక్యత చెడిపోవడం ఎప్పుడారంభించినదంటే.

Sri T. Nagi Reddi :— Capital విషయంలో

The Hon. Sri T. Prakasam :— Capital విషయంలో అంటారు మీరు. కాదు. ఎప్పుడయినా సరే, భద్రం అయినా సరే మరేదైనా సరే మీరందరూ ఒప్పుకో వలసినదే. చేసినపనులు తప్పుచేశాము అని ఒప్పుకొని దిద్దుకొని ఒకదారికి రావలసినటువంటి మనుష్యులంగాని అంతకంటె వ్యతిరేకంగా నడిచే జాతికాదు మనం. 1946-వ సంవత్సరంలో నేను కొన్నిరోజులు యీవుద్యోగంలోకి వచ్చినతరువాత ఈ తిరుపతి బిల్లు విషయం నేను కూడా ఆలోచించాను

ఈ తిరుపతి యూనివర్శిటీ అంటే నా మనస్సుకు కనబడేది ఆతట్టు దక్షిణాదినుంచి [illegible] పెట్టినబిల్లు కాకుండా, ఇంగ్లండులో Oxford, Cambridge యూనివర్శిటీ

లలో అనుభవం సంపాదించివచ్చిన C. R రెడ్డిగారు సూచించినటువంటిది. ఆతను చచ్చిపోయేవఱకూ మనం ఎన్ని పొరపాట్లుచెయ్యాలో అన్నీచేశాం. మనలో మనం కొట్లాడుకుంటూంటే, మా ఊరికి మా ఇంటికి విశ్వవిద్యాలయం రావాలంటే మాఇంటికి రావాలని, పెద్ద పెద్దవాళ్లే పోటీపడితే ఆఖరికి ఈ వాల్తేరుకు యూనివర్శిటీ వచ్చింది. ఈ యూనివర్శిటీవేరు, తిరుపతిలో యూనివర్శిటీవేరు, ఆ మనుష్యులువేరు, ఈ మనుష్యులువేరు అనే అభిప్రాయం రానివ్వకూడదు. ఐక్యతపోతుంది పోతుందంటే, ఎవరు పోగొడతారు, ఎక్కడ పోగొడతారు. ఇంత అల్లకల్లోలం చేసుకుంటున్నామే, ఆఖరికి కొట్టుకొన్నంత పని జరుగుతోన్నా, ఐక్యత పోకుండా ఈ శాసనసభలో కూర్చున్నాం, మాట్లాడుతున్నాం. ఎన్నో బిల్లులు pass చేస్తున్నాం. ఐక్యత పోయేదికాదు తాత్కాలికంగా పోటీలో, fight లో నేను గెలుస్తానంటే, నేను గెలుస్తానని అనుకుంటారుగాని అందుచేత ఐక్యత పోయేదికాదు. ఐక్యతపోక పోగా ఎక్కువచేసే ఉద్యమం ఇది. ఒక్కటేమాట చెబుతున్నాను ఈ బిల్లు చాలాగొప్పది. తిరుపతికొండకు ఎక్కడెక్కడనుంచో వస్తారు. ఆ చరిత్రలోకిపోతే లెక్కలేనంత కథ అది. ఆ కొండది అటువంటి మహాచరిత్ర. నేను orthodox man కాదు. పూజలు చేసేవాణ్ణి కాను ఆంధ్రరాష్ట్రంవచ్చినతరువాతకూడా, నేను ఇప్పటికీకూడా ఒక్కరోజుకూడా తిరుపతిలో అడుగుపెట్టలేదు. తిరుపతికి చేయవలసిన సేవ ప్రజలకుచేయవలసిన సేవ. నాకు ఎప్పుడూ సందేహం లేకపోగా గట్టినమ్మకం ఉన్నది. ఏమంటే ఇది ప్రపంచంలో యుండే యూనివర్శిటీలలో గొప్ప యూనివర్శిటీ అనేపేరు సువర్ణాక్షరాలతో వ్రాయబడేటట్లు వృద్ధి పొందుతుంది. అది దేముడే వ్రాశాడు

Sri N V L. Narasimha Rao — పంతులుగారు చెప్పినదానిలో నేను అడ్డంవచ్చాననుకోకండి. రెండు ఏండ్ల సమాచారం ప్రారంభించి ఆపేశారు. ప్రస్తుతం ఈ affiliation రెండుసంవత్సరములవఱకూ జరగకుండా ఉండుటకు గురించి పంతులుగారి అభిప్రాయం చెప్పమని ప్రార్థిస్తున్నాను.

The Hon. Sri T Prakasam ·— పట్టాభిరామారావు క్రొత్తవాడుకాడు మీకుగాని, నాకుగాని ఈ బిల్లు అతనిపేరుమీద ఎందుకుపెట్టామంటే విద్యావిషయాలలో 15 సంవత్సరాలుగా పనిచేసుకుంటూవస్తూ ఉన్నవాడు కనుక మీకుకావలసిన information ఇచ్చుటకు సిద్ధంగా కూర్చున్నాడు.

Sri Pillalamarri Venkateswarlu:— రెండుసంవత్సరాల అనంతరం దాన్ని affiliating University చేస్తామని ఈ నాడు నిర్ణయంతీసుకోవలసిన అవసరం ఏమున్నది. Residential గా అట్టేపెట్టి మనం continue ఐతే మనం, లేకపోతే అప్పుడుండేటటువంటి ఎసెంబ్లీ తగినచర్య తీసుకుంటుంది. రెండుసంవత్సరాల అనంతరానికి ఈనాడే తీర్మానం ప్రకాశం పంతులుగారు ఎందుకు చేస్తున్నారు?

The Hon. Sri T. Prakasam :— ఎందుకుచేస్తున్నామంటే మీలాటివారు కూర్చుని ఉన్నదీ లేనిదీ కల్పించి గందరగోళం చేస్తున్నారు కనుక, రెండేండ్లు వదలు

[The Hon. Sri T Prakasam] [29th May 1954

కొన్నిప్పటికీకూడా, తరువాత affiliating గా చేసుకుందామని ఒక అభిప్రాయం బలంగా ఉంది కాబట్టి. మన అందరి ఇష్టంమీదా మనం చేస్తూ ఉన్నపని ఇది. విశ్వవిద్యాలయం ఎందు కోసం పెడుతూఉన్నారన్నారు. ఐక్యత చెడగొడుతోందని మీరంతా condemn చేసినా, మేము ఐక్యతలేకుండా చేస్తున్నామన్నప్పటికీ మనమందరంకలసి ఐక్యత స్థాపిస్తూయున్నాం. మనమే కాని ఆకాశంనుంచి ఎవరూరావడంలేదు. ఎవరినీ లెక్కచేయకుండా మనమే పనిచేసు కుంటూ వస్తున్నాం.

Deputy Speaker — The House will now adjourn for lunch and will meet again at 3-30 p. m.

## After Lunch 3-30 p. m.

The Hon. Sri S. B. P. Pattbhirama Rao — ఈ బిల్లు పైన ముఖ్య మంత్రిగారితో కలిసి మొత్తం పందొమ్మందుగురు గౌరవసభ్యులు మాట్లాడారు. వారి అభి ప్రాయాన్ని స్ఫుటంగా చెప్పారు. గౌరవనీయులగు ముఖ్యమంత్రిగారు చెప్పినతరువాత కొంతవరకు బాధ్యత సులువు అయింది అని మనవి చేస్తున్నాను. నాకు తెలియని విషయాలు కూడ వారియొక్క విజ్ఞానముచేతనేమి, అనుభవముచేతనేమి స్పష్టంగా తెలిపారు. అందువల్ల నా శ్రమ తగ్గింది. అసలు ఏదిచెప్పినా reason నిలబెట్టుతారు అనే నమ్మకం ఉంది. ప్రతి పక్షనాయకులు శ్రద్ధగవిని, జాగ్రత్తగ ఆలోచించి ఒక నిర్ణయంచేయడం అవసరం అని మనవి చేస్తూ ఉన్నాను. ఎన్నోసంవత్సరాలకు ఆంధ్రరాష్ట్రం వచ్చింది. దానికి సమానంగా తిరుపతి విశ్వవిద్యాలయం వచ్చేసంవత్సరంలోపుగా తలపెట్టాము. ఈ తలపెట్టిన విశ్వ విద్యాలయం చక్కగా ప్రారంభింపబడి అది అభివృద్ధిచెందుతుంది. అంటే ఈనాడు పాతుతూ ఉన్నటువంటి చిన్నమొక్క పెద్దవృక్షమై, ఆంధ్రదేశానికే గాక ప్రపంచానికి అంతకు ఆదర్శప్రాయమైన విశ్వవిద్యాలయం కావలెనని ఆశిస్తూఉన్నాను అందులో కొంత విశిష్టత ఉంది అని మనవిచేస్తున్నాను. చర్చలో విషయాలు అన్ని సమగ్రంగా తెలిపారు ఆవిషయాల అన్నిటికికూడ కొంతవరకు సభ్యులు వారిలోవారు జవాబులు ఇచ్చారు. అయినప్పటికి ముఖ్యముగా కొన్ని జవాబులు చెప్పవలసిన అంశములు ఉన్నాయి గనుక వాటికి సమాధానము మనవిచేస్తున్నాను.

అధ్యక్షా, ఆనాడు ప్రతిపక్షనాయకులు టి. నాగిరెడ్డిగారు మాట్లాడుతూ expert committee సూచించిన కొన్నివాక్యములను గురించి చెప్పారు. వారుకాకుండా ప్రతిపక్ష సభ్యులు కొందరు అది ఆధారంగా తీసుకొని expert committee సభ్యులకు freedom ఇవ్వలేదని వ్యాఖ్యానించారు. వారే నిర్ణయంచేయడం అయితే ఇంకోలాగున నిర్ణయంచేసి ఉండేవారని చెప్పారు. కొంతెము విద్యావేత్తలు కాబట్టి ఆవిధముగ, ఈవిధముగ చెప్పినతరు వాత వారియొక్క తుది అభిప్రాయాన్నికూడ తెలిపారు. విశ్వవిద్యాలయం ఏవిధముగ స్థాపించాలి? ఏవిధముగ స్థాపించితే బాగా ఉంటుంది? తిరుపతి సరియైనస్థలమా? ఎటువంటి వాతావరణము ఉండవలెను, అని వారిని అడిగాము. వారియొక్క అభిప్రాయం ఎటువంటి type

29th May 1954] [The Hon. S. B. P. Pattabhirama Rao]

of University అని సమగ్రంగా చర్చించుతూ, వారు alternative సూచించారుగాని అది జరుగవలెనని ఎక్కడలేదు. కేవలం అది మంచిది అని నాకు అర్థం అగుటలేదు, నాకు భాష తెలిసినంతవరకు. నేనుగూడ ఇంగ్లీషు చదువుకున్న వాడిననే అనుకుంటున్నాను. ఐతే పిల్లమర్రి వెంకటేశ్వర్లు గారికంటె ఎక్కువ పరిజ్ఞానం నాకు లేకపోవచ్చును. అసలు మీరు కొంతదూరము వెళ్లి చూస్తే అక్కడ ఇక్కడ చెప్పినతరువాత ఏవిధంగా పాటించవలసినదీ గూడ వారు conclusion లో చెప్పారు. వీరు చెప్పినదాంట్లో దానిని వెంకటేశ్వర్లుగారు వదిలివేశారు. బహుశః వదిలిపెట్టాలనే వదలివేసివుంటారని భావిస్తున్నాను

"Our conclusion therefore is that the new University should have its seat at Tirupati, it should have teaching and research and it should also affiliate colleges in the Rayalaseema area."

అని చాలా clear గా ఇక్కడ చెప్పారు. ఇంతకంటె యింకా తెలుగులో వివమర్చి చెప్పవలసిన అవసరం కనుపించటం లేదు. అంతవరకు చెప్పి నేను ముగిస్తున్నాను.

దీనినిగురించి కొంద వ్యాఖ్యానించారు. అది అంత serious గా నేను తీసుకోవటం లేదు. అపార్థం చేసుకున్నారు. ఏ క్రొత్త University స్థాపించినప్పటికీ విద్యార్థులకు ఒకటి రెండు సంవత్సరములవరకు ఇబ్బందులులేకుండా వుండేటట్లుగా చేయబడుతుంది.

Andhra University మొదట మదరాసు University లో నుండి విడదీయ బడ్డది. ఆ తరువాత ఓఢ్రులు మనలోనుండి విడిపోయి ప్రత్యేకంగా University ని ఏర్పచ్చుకున్నారు. అయినా రెండు సంIIలో 3 సంIIలో పాత విశ్వవిద్యాలయంలోని కోర్సులే విద్యార్థులకు ఈ క్రొత్త University లో ఏర్పాటుచేయబడుతూ వుండేవి. జూనియర్ తరగతులు pass అయి సీనియర్ తరగతులకు వచ్చినప్పుడు ఈ క్రొత్త విశ్వవిద్యాలయంలో ఆ విద్యార్థులకు ఇబ్బందులు లేకుండావుండే పద్ధతుల్లో అవే కోర్సులుపెట్టి పరీక్షలు జరుపుతూవుండటం జరుగుతుంది. ఫలితాలు మాత్రం క్రొత్త University వారే వెల్లడిచేస్తూ వుంటారు.

"It may however, be noted that for two years to come, the examinations of students in affiliated colleges in this area must continue to be conducted by the Madras University."

అనికూడా రిపోర్టులో ఉంది.

అందువల్ల పరీక్షలలో తప్పినవారికిగూడ రెండు సంవత్సరాలు పాతకోర్సులనే అమలుపర్చకపోతే విద్యార్థులకు అన్యాయంచేసినట్లుగా వుంటుంది. నెల్లూరు కాలేజి ఆంధ్ర యూనివర్సిటీలో వుంది. వెంటనే దీనిని affiliate చేయదలచుకుంటే రెండు సంవత్సరముల పాటు ఆపాత కోర్సులలోనే విద్యార్థులకు పరీక్షలు ఏర్పాటుచేయవలసి వుంటుంది. results మాత్రం ఈ క్రొత్త University లో ప్రకటిస్తూ వుంటారు. ఇంతకంటే

[The Hon. Sri S. B. P. Pattabhirama Rao] [29th May 1954

ఏమీలేదు. ఒకవేళ రాయలసీమ కాలేజీలను వెంటనే తిరుపతి యూనివర్సిటీలో కలపక పాత విశ్వవిద్యాలయంలోనే వుంచి రెండు సంవత్సరాల తరువాత కలుపుకోనవచ్చును. అది సభ్యుల యిష్టంమీద వుంటుంది. అలాగాకుండా ఆ కాలేజీలను వెంటనె Andhra University లో కలిపితే రెండు సంవత్సరాలవరకు మదరాసు యూనివర్సిటీ కోర్సు ప్రకారం పరీక్షలు జరపటానికి విద్యార్థులకు అవకాశం యివ్వవలసివస్తుంది. రెండు సంవత్సరములైనతరువాత మరల యీ కాలేజీలను Tirupati University లో కలపదలచుకుంటే మరల రెండు సంవత్సరములపాటు అక్కడి విద్యార్థులకు యీ క్రొత్త University లో అవకాశం కలుగజేయవలసివుంటుంది. ఇదిఅంతా శ్రమగావుంటుంది విద్యార్థులకుగూడ చాలా కష్టముగాను శ్రమగాను వుంటుంది. రాధాకృష్ణన్‌గారి రిపోర్టునుగురించి చెప్పారు దాంట్లో clear గా రెండో University పెట్టాలని, దానిని Residential గా మొదలుపెట్టి అది డెవలప్ అయినతరువాత Affiliating గా చేసుకోవచ్చునని చెప్పారు. మొత్తంమీద అదికూడ సరియైనపద్ధతే. నాగిరెడ్డిగారు పరీక్షచేసి ఆ అభిప్రాయమునే చెప్పారు. Experts, Committee లో వారుచెప్పిన conclusions చదివి వినిపిస్తున్నాను. అందులో

(a) Since then a purely residential University may have been a success in other countries, but their success in ours remains to be demonstrated,

(b) The difficulty of lack of endowments, limited fee-income and consequent dependence on the State for the bulk of their resources;

(c) Lack of well-established tradition in the professorial staff for managing the University;

ఈ మూడుకష్టాలు చెప్పారు Purely Residential University అయినప్పుడు ఉండే కష్టాలు చెప్పారు. నాగిరెడ్డిగారు వైస్‌ఛాన్సలర్ కృష్ణాగారు చెప్పినదానిని గురించి రిమార్కు చేశారు. నాకు అట్లా కనుపించటం లేదు.

Sri T. Nagi Redi said that the statement itself is in favour of a residential type of University. His argument is, that for the Andhra University the fee income was small or negligible till 1951. It was only after 1941 that the Andhra University could count upon the substantial fee income in view of the large number of additional colleges started in the Andhra University area.

దీనిమీద నాగిరెడ్డిగారు conclusion ను draw చేశారు. 1948 వరకు income కాలేదు గనుక, affiliating చేసినా, income ఏమివుంటుంది? కాబట్టి ముందు residential గా పెట్టితే బాగుంటుందని వారు చెప్పారు. 1926–27 లో

University స్థాపింపబడింది. అప్పుడు పరీక్షలు వగయిరాలకు ఖర్చుపెట్టినదానికి 4 రెట్లు మొత్తం examination fees వల్ల వచ్చింది. Rs. 3855 ఖర్చు అయితే రు. 54757 లు examination fees వల్ల వచ్చింది. తొలిసంవత్సరం రు. 8986 లు వచ్చింది. దగ్గర దగ్గర 100 కి 50 ఇది. తొలిసంవత్సరం affiliating చేయటంవల్ల విశ్వవిద్యాలయమునకు ఇంతమొత్తం వచ్చినట్లుగా కనిపిస్తున్నది 1953–54 లెఖలు చూస్తే 10 లక్షలు పైచిలుకు, examination fees వల్ల వచ్చింది ఈ విధంగా కొంతవరకు విశ్వవిద్యాలయానికి లాభంకలుగుతూ నేవుంది 1939 లో ఒకలక్షా 12 వేలు ఖర్చు అయితే, ఒకలక్షా 30 వేలు వచ్చింది. ఇదంతా లాభమే. అసలు ఈ విశ్వవిద్యాలయం 1926 లో స్థాపింపబడినప్పుడు, Affiliating University గానే start అయింది.

1934 వ సంవత్సరంవరకు కేవలం Affiliating University గా ఉంటూ వచ్చింది. Teaching in the real sense' కు అవకాశము లేకపోయింది. 1938-వ సంవత్సరంనుంచి Teaching University గా మొదలుపెట్టింది. Vice-Chancellor గారుకూడ ఇవి రెండు ఉండాలనే చెప్పారు. అసలు మొదట Affiliating University గా మాత్రమే పనిచేయడం సరియైనపద్ధతిగాదు. మద్రాసు విశ్వవిద్యాలయము, కలకత్తా విశ్వవిద్యాలయము అట్లాగా పనిచేస్తూ వచ్చాయి. కాని ఇప్పటి పద్ధతిప్రకారం కేవలం Affiliating University గా గాని Residential University గా గాని ఉండకూడదు. అది సరియైనపద్ధతికాదు. రెండుకలిపే పనిచేయవలసిందని Vice-Chancellor గారు చెప్పారు. మొట్టమొదట పాతపద్ధతిప్రకారం ఒకవిధంగా లాభము కలుగుతుందని, కొంతడబ్బు చేకూర్చగలమని ఆ విధంగా చేశాము. ఈ విశ్వవిద్యాలయానికి foundation క్రింద 26 లక్షలు ప్రభుత్వము ఇచ్చింది. ఇది సరియైన figure కాదేమో అనుకుంటాను. సరిగా గుర్తులేదు. అయినా ఇంతకంటె తక్కువకాదు. తర్వాత ప్రత్యేకపువాని ఈ ఆంధ్ర విశ్వవిద్యాలయానికి ఏర్పడింది. దీనికి అప్పుడు జయపూరు మహారాజాగారు బంగారు ఘనిగా దొరికారు. ఈనాడు ఈ విశ్వవిద్యాలయముయొక్క నలుమూలలు చూస్తే ఆయనయొక్క శాశ్వతమైన సహాయమే కనిపిస్తున్నది. సాలుకు 4 లక్షలరూపాయలు సేకరించి ఇచ్చారు. ఆ మహారాజు పోయారు. ఆ ఎస్టేట్లుకూడ abolish అయ్యాయి. ఆయనవల్ల చాలా సంవత్సరములవరకు ఈ విశ్వవిద్యాలయము లాభముపొందింది. ఈ మూలధనముమీద వడ్డీవలన వచ్చే ధనము చూస్తే సాలుకు లక్షరూపాయలు వడ్డీవచ్చే అవకాశం కనిపిస్తున్నది. ఈవిధంగా Affiliating and Residential University గా ఈ University పెరుగుతూ వచ్చింది. మొదట Affiliating University గా start అయినతరువాత Residential University గా కూడా మారి ఇప్పుడు రెంటితోటి develop అయింది. వారు అప్పుడు అనుకొన్నటువంటిది ఇందుకు వ్యతిరేకముగా ఉండినది. అప్పుడు అవిధంగా అనుకున్నారు కాని ఆ పాతపద్ధతి సరియైనది కాదని Affiliating and Residential పద్ధతులు కలిసి ఉండేపద్ధతి మంచిదని చెప్పారు. కేవలం Residential గా ఉంటే కొంతలాభము వస్తుం

[The Hon Sri S. B. P. Pattabhirama Rao] [29th May 1954

వస్తోన్నా దానివల్ల చాలానష్టము సంభవిస్తుంది. ఆ విశ్వవిద్యాలయము stunted growth గలదిగా అవుతుందేమోనని భయమగుచున్నది Affiliating University గా ఉండినట్లయితే హెచ్చులాభం రాకపోయినా, నష్టంరాదు. ఒక విశ్వవిద్యాలయానికి కొన్ని జిల్లాల jurisdiction పెట్టినప్పుడు అక్కడివారు దానిమీద interest తీసుకొనుటకు, ఇంకా హెచ్చు కాలేజీలను స్థాపించడానికి. ఆకాలేజీలను పెద్దచేసుకొని ఇప్పుడు చదివేవాళ్లకంటే హెచ్చుమంది చదువడానికి అవకాశముంటుంది Jurisdiction లోని అందరికి దగ్గరగా ఉంటుంది కాబట్టి అందరికి ఈ కాలేజీలలో చదవడానికి అనుకూలంగా యుంటుంది. Vice-Chancellor ఆవిధంగానే చెప్పారు. కాని ఎవరోఒకరు ఆయన అభిప్రాన్ని ఇంకోవిధంగా చెప్పారు. ఇప్పుడు Residential University గా start చేసి తరువాత కొన్ని సంవత్సరములకు Affiliating గా చేయవచ్చునని చెప్పారని చెప్పారు. అయితే ఆయన చెప్పిందదికాదు. Affiliating and Residential University గా మొదలుపెట్టి ఆ విశ్వవిద్యాలయము కొంతకాలము develop అయినతరువాత Affiliating తీసివేసి కేవలం Residential గా ఉంచుకొని ఒకవేళ విశాలాంధ్ర వచ్చినట్లయితే ఆంధ్రప్రాంతంలో మధ్యగా ఒకచోట గుంటూరులోనో మరొక మధ్యస్థానంలోనో Affiliating or Research Univirsity ఒకటి start చేసి అన్ని కాలేజీలు దానికి చేర్చవచ్చు. ఈవిధంగానే educationists అయితేనేమి, విశ్వవిద్యాలయంలో అనుభవమున్నవారైతేనేమి వీరంతాకూడ ఈ రెండు విధానాలు కలిపే విశ్వవిద్యాలయం ఉండడం చాలా మంచిదని చెప్పారు అయితే మొదట Residential గా మొదలుపెట్టి కొంతకాలము, అంటే 1, 2 సంవత్సరాలు, తరువాత రెంటిని కలిపి ఫలానా సంవత్సరంనుంచి Affiliating గా ఉండాలని అంటే అభ్యంతరంలేదు ముఖ్యంగా ఈవిషయంలో సభ్యులు అనేకమైన అనుమానాలు వెలిబుచ్చారు. ముఖ్యంగా రాజకీయకారణాలు చెప్పారు. ఈవిధంగా Affiliating University చేయవడంవల్ల దేశం రెండుభాగాలుగా విభజించినట్లవుతుందని, ప్రాంతీయ దురభిమానాలు ఏర్పడుతాయని చెప్పారు. కాని అటువంటి అనుమానా లేవి ఉండనవసరంలేదు. గత 6 సంవత్సరములనుంచి ఇటువంటి అనుమానాలు ఉండి ఉండవచ్చును. వీటికి ఒక అంతముండాలి. ఇకముందైనా వీటికి ఒక full-stop ఉండాలి. విద్యావిషయంలోకూడ ఇటువంటి అభిప్రాయాలు వస్తాయని మేము ఎన్నడు అనుకోలేదు. అటువంటి అభిప్రాయం మాకెన్నడూలేదు. ఆవిధంగా అనుకోవడం చాలా అన్యాయము. రెండు విశ్వవిద్యాలయాలు ఉండడంవల్ల తప్పులేదు. చదువులో ఎంతో వెనుకబడియున్నాము కాబట్టి మన ఆంధ్రదేశంలో ఎన్నోకళాశాలలు స్థాపించి వాటినన్నిటినీ అభివృద్ధిచేయవలసి యున్నది. అటువంటప్పుడు రెండు విశ్వవిద్యాలయాలు పెట్టుకొనడంలో తప్పేమిలేదు. విద్యాభివృద్ధి కొరకే ఈవిధంగా చేస్తున్నాము. రెండు విశ్వవిద్యాలయాలు ఉండకూడదు, విద్యాభివృద్ధి మాత్రం కావాలంటే ఎలా జరుగుతుంది. మాను పెరగాలి, చెట్టు పెరగకూడదు అన్నట్లున్నది ఇది. మానుతోపాటు చెట్టుకూడ పెరుగుతుంది. ఆంధ్రరాష్ట్రం వచ్చినతరువాత ఇక్కడ రెండు విశ్వవిద్యాలయాలుండడంలో విశేషమేమిలేదు. రెండు వుండవలసిందే. బొంబాయి,

ఉత్తరప్రదేశ్ తీసుకోండి. అక్కడ ఎన్నో విశ్వవిద్యాలయాలున్నాయి, అయితే బొంబాయిలో ఒకభాషకు ప్రత్యేకంగా ఒక విశ్వవిద్యాలయం ఉన్నదని ఉత్తరప్రదేశ్‌లోకూడ అదే విధంగా ఒకభాషకు ప్రత్యేకంగా ఒక విశ్వవిద్యాలయం ఉన్నదన్నారు ఆవిషయం నాకు సరిగా తెలియదు. అందుకని ఈ సంగతి ఏమిటని రంగధామరావుగారిని అడగాను.

"Excepting Bombay and Madras no other State has more than one affiliating type of University. Nagpur, Madhya Bharat and Saugar are of a unitary type.'

So says the Leader of the Opposition in a slip handed over to me. May I tell him, it is grossly incorrect. Those Universities are intended for the whole area of the respective States.

భాషకొరకు ఆప్రాంతాన్ని restrict చేశారని అనుకోవడం పొరబాటు. దానికోసమే కాదు, ఇతర కారణాలవల్లను, అన్ని విషయాలను ఆలోచించి ఆవిధంగా చేశారని అన్నారు

"Baroda and Ahmedabad Universites serve the needs of Gujarat; Poona University serves Maharashtra; Kannada serves the needs of Kanarese area, while Bombay serves the great cosmopolitan centre. Such regions often overlap provincial lines."

అంతేగాని అటువంటి అభిప్రాయం ఎక్కడారా లేదు.

Sri T Nagi Reddi.—అది నిజమే అయి ఉండవచ్చుకాని, University Headquarters ఆ భాషాప్రాంతానికి దగ్గరలో ఉండేదానికొరకు ప్రత్యేకంగా పెట్టవలసి వచ్చింది. ఎందువల్లనంటే మహారాష్ట్ర Headquarters గుజరాతీ ప్రదేశంలో లేదు. ఆ విధంగానే బొంబాయి Headquarters కన్నడప్రదేశంలో లేదు అనే అభిప్రాయంతో ఆవిధంగా చేశారని చెప్పుచున్నాను. అయితే, ఇక్కడ ఆంధ్రదేశములో అన్నిటికి ఒకే Affiliating University చేస్తామంటే వచ్చిన నష్టమేమిటి అని అడుగుతున్నాను.

The Hon. Sri S B P. Pattabhirama Rao:—రెండు విశ్వవిద్యాలయాలున్నాకూడా, రెండిటిలో చదువుకోడానికి వీలులేదా. ఇక్కడివారు ఆ కళాశాలలలో చదువవచ్చు, అక్కడివారు ఈ కళాశాలలలో చదువవచ్చు. ఇక్కడ ఏవైనా courses లేకుంటే అక్కడపోయి చదువవచ్చు, అక్కడ ఏవైనా courses లేకుంటే ఇక్కడవచ్చి చదువవచ్చును. అటువంటి ఇబ్బంది ఏమిలేదు. కనుక 2 విశ్వవిద్యాలయాలుండడంలో తప్పులేదు. రెండు విశ్వవిద్యాలయాలు ప్రాంతీయ దురభిమానాలు లేవదీస్తాయన్న వాదన సరియైన వాదనకాదు. కేవలం రెండు విశ్వవిద్యాలయాలే కాదు విద్యావ్యాప్తికావాలంటే 3, 4 విశ్వవిద్యాలయాలుకూడ అవసరమే. కళాశాలలు ఏవిధంగా అభివృద్ధిచెందుతున్నాయో, students ఏవిధంగా అయితే పెరుగుతున్నారో అదేవిధంగానే విశ్వవిద్యా

[Sri S. B. P. Pattabhirama Rao] [29th May 1954

లయాలుకూడ పెరగవలసియుంటుంది. కనుక ఈ క్రొత్త University విషయంలో Affiliating and Residential University గా ఏర్పాటుచేస్తేనే మంచిదని విశ్వవిద్యాలయంలో అనుభవమున్నటువంటివారు చెప్పారు. అటువంటివారి సలహా పాటిస్తే మంచిదని మనవిచేస్తున్నాను

పిల్లలమర్రి వెంకటేశ్వర్లుగారు మాట్లాడుతూ University కి examination fees వల్ల లాభమువస్తుందని అన్నారు. అలాంటిది ఎంతవరకువస్తుంది, అది ఎంతవరకు లభిస్తుంది, అదివస్తే, యింక State డబ్బు ఎంతసర్దుబాయిచేయాల్సివుంటుంది, అనేవిషయాలు ఆలోచించాలి. State కు డబ్బులేకపోతే ప్రజలవద్దనుంచి అయినా విరాళాలరూపములో వసూలుచేయాల్సివుంటుంది. కాని అంతమాత్రాన, University ని పెంపొందించడము కష్టము. ప్రభుత్వము తగిన ధనసహాయ్యము చేయటానికి ఆక్షేపణవుండదు. అంతేకాకుండా అక్కడవున్న దాతలు విరాళాలు యిచ్చే అవకాశముకూడవుంది. అందువల్ల University లను self-supporting గా వుండేటట్లు చూడాలి.

తరువాత membership కూడా ఆ ఏరియాకు limit చేయాలని అన్నారు. Membership విషయములో ప్రభుత్వము క్రొత్తపంథాగూడా త్రొక్కడములేదు. యూనివర్శిటీ ఏ ఏరియాలో అయితే వుంటుందో, అక్కడ దాతలువుండడము సహజము. వారికి Membership లభించడముకూడా సహజమే. ఈ membership విషయములో ఎలాంటి అనుమానాలువున్నను అవన్ని తొలగించడముమాత్రము చాలా సరము. తరువాత పంచాయితీబోర్డులకు Municipal Councils కు University విషయములో representation ఆంధ్రదేశములో అన్నిచోట్లకు యిచ్చాము. వారికి ప్రాతినిధ్యము యివ్వటములో తక్కువచేయలేదు. ఇందులో అనుమానాలు అవసరములేదు. Affiliating University గా వుంటే దాతలనుంచి విరాళాలురావు, Residential University గా వుంటేనే విరాళాలు వస్తవి అని తెల్పారు. University ఏరియాలో వున్న భూస్వాములు, ధనికవర్గమువారు విరాళాలు యిస్తేగాని లాభములేదు ఈ విరాళాల వల్ల యూనివర్శిటీకి ఎంతోలాభమువుంటుందిగదా అని అన్నారు. నిజమే. Residential యూనివర్శిటీలో కావలసినన్ని వుద్యోగాలుగూడా వుంటాయి. కాని educationists of high order రమ్మంటే రారు. University affiliating గా వుంటేనే ఎవరైనా బాగా చదువుకున్నవారు వస్తారు. అందువల్ల యీ విధానము సరియైనదికాదని University యే పెద్దలు చెప్పారు. Residential University అంటే, అది కేవలము Teaching అని అంటున్నాను. ఇప్పుడు యూనివర్శిటీలో నేకొంత అనుభవము చిక్కినతరువాత, కాలేజీలలోకివెళ్లి ఉద్యోగాలుచేస్తున్నారు. యూనివర్శిటీలోనే పెద్ద standard సంపాదించి, ఆ standard తో యితరచోట్లకు వెళ్లగలుగుతున్నారు. ఎవరినైనను పెద్దపెద్దవాళ్లను, విద్యలో ఎక్కువగా ప్రవీణతసంపాదించిన వారిని రప్పించటానికి ప్రయత్నముచేస్తే కేవలము Residential University

అయినందువల్ల వారు రారు. అందువల్ల Residential University ని successful గా నడుపుదామని అంటే, ఎంతో కష్టతరమైనవిషయము. కేవలము Residential University గా ప్రారంభించినప్పటికిని, అది బాగా develop అయి, వృద్ధిలోకి రావడానికి కొంతకాలముపట్టుతుంది. కేవలము గుమాస్తాపనిలో ప్రవేశించి, సూపరింటెండెంటు పని కావటానికి, తగినంత అనుభవము సంపాదించటానికి చాలాకాలముపడుతుంది. సూపరింటెండెంటుకావటానికి ఎంతకష్టపడవలసివుంటుందో ఆలోచించాలి. అదేమాదిరిగా Residential University గా ప్రారంభించినప్పుడుకూడ అది అభివృద్ధికావటానికి కొంతకాలము పట్టుతుందని సభ్యులు గ్రహించాలి.

నెల్లూరు కళాశాలలు తిరుపతి యూనివర్శిటీలో కలపవద్దని కొందరు అంటున్నారు. ఈ సందర్భములో నేనొకవిషయము చెప్పదలచాను. సభ్యులు నెల్లూరుకాలేజీల విషయములో చాలా తమాషాగా మాట్లాడుతున్నారు. అవి కలపకూడదు అనేది ఒక వాదము, లేకపోతే తిరుపతి రాయలసీమవారికి ప్రత్యేకముగావుండే విశ్వవిద్యాలయము అని చెప్పడము మరొకవాదము. ఆ విధంగాచూస్తే, నెల్లూరుజిల్లా కలపకపోతే, ఎక్కడో వున్న శ్రీకాకుళంజిల్లా కలపటానికి వీలు అవుతుందా? కేవలము యిది రాయలసీమ వారికేనన్న restriction కూడదని అంటున్నాను. ఒక యూనివర్శిటీ పెట్టేటప్పుడు దాని చుట్టుప్రక్కలవున్న జిల్లాలలోని కళాశాలలన్నియు అనుబంధింప జేయాల్సివుంటుంది. ఈ విధంగాచేస్తే వుభయత్రాలాభముగావుంటుంది. ఒకవిధంగా దగ్గరలోనున్న విద్యార్థులకు సౌకర్యముగావుంటుంది. అంతేకాని ఒకజిల్లావారికి వుపయోగించేటట్లుగాను, మరొక జిల్లా వారికి అన్యాయముచేయాలన్న వుద్దేశ్యములేదని మీకు హామియిస్తున్నాను. దగ్గరలో విశ్వవిద్యాలయముపెట్టుకొని, రాయలసీమవిద్యార్థులకు ఎందుకు విద్యరాలేదని - అంటే, మద్రాసు దగ్గరలోవున్నదని అక్కడికివెళ్లారు, అందువల్ల రాలేదని అన్నారు. ఎక్కడ విద్యాసౌకర్యాలు బాగావుంటే అక్కడికివెళ్లుతారు. మనము నిర్మించబోయే విశ్వ విద్యాలయము అభివృద్ధిచెందినకొద్దీ, విద్యార్థులు ఎక్కువగావస్తారు. నెల్లూరుజిల్లా కళాశాలలు తిరుపతిదగ్గరగావున్నవి గనుక అక్కడివిద్యార్థులు తిరుపతి యూనివర్శిటీకి రావటానికి వీలుగావుంటుందని నేను నెల్లూరుకళాశాలలు కూడా కలపవలెనని అంటున్నాను. అంతేకాని, వారికి వీరికి మధ్య విభేదములుకల్పించాలనేవుద్దేశ్యము మాత్రము లేదు. దానివల్ల ఉభయత్రాలాభము పొందుతారు.

సిద్దన్నగౌడుగారు తిరుపతి విశ్వవిద్యాలయమునుముందు affiliating University చేసి, తరువాత residential చేయమని అన్నారు. ఆవిధంగా చేయడము modern method కు చాల్లా విరుద్ధముగా వుంటుంది గనుక ఆవిధంగాచేయడము మంచిదికాదు. కేవలం Residential University గా వున్నప్పటికిని పరవాలేదు. అందువల్ల యీ తిరుపతి విశ్వవిద్యాలయము both Residential and Affiliating University గా పెట్టాలని నా అభిప్రాయము. రెండు కర్తవ్యములుగా చేసేబదులు ఒకేకర్తవ్యము

చేయవచ్చును. కాని కొంతమంది సభ్యులకు అనుమానాలు కలుగడమువల్ల ముందు రెండు సంవత్సరములపాటు residential గా చేస్తూ, తరువాత Affiliating University గా మార్చటం మంచిది. దీనికి సుబ్బారెడ్డిగారుగూడ ఒక amendment తెచ్చారు. కాబట్టి నేను అన్నివిషయములు ఆలోచించి 1956వ సంవత్సరము ఆగస్టు నెలనుంచి, అంటె 1956 academic year నుంచి దీన్ని Affiliating గా చేయడము మంచిదని నా అభిప్రాయము. దీనికి శ్రీ ప్రకాశంపంతులుగారుకూడా ఒప్పుకున్నారు. ప్రప్రథమముగా residential and affiliating గా మాత్రముకాదు, మొట్టమొదట రెండుసంవత్సరములవరకు residential university గా వుంచి, ఆతరువాత affiliating చేయాలని అనుకున్నాము. ఈవిధంగాచేయడం సక్రమమైన పద్ధతిగనుక, ఈ అభిప్రాయానికి సభ్యులందరు సుముఖంగా వున్నారని భావిస్తున్నాను. మీరందరు యీ తిరుపతి విశ్వవిద్యాలయమును పైచెప్పినవిధంగా చేయటానికి సహాయం చేస్తారని ఆశిస్తూ యింతటితో అధ్యక్షులవారినుంచి శలవుతీసుకొంటున్నాను.

Sri T. Nagi Reddi —Bombay University Act లో University Colleges ను గురించి మంత్రిగారు చెప్పారు. వాటి purpose ను గురించి, అందులో

> "The Universities of Bombay Presidency are intended to serve different linguistic areas. Baroda and Ahmedabad Universities serve the needs of Gujerat; Poona University serves Maharashtra!" అనిఉంది.

The Hon. Sri N. Sanjeeva Reddi :—From which report are you reading?

Sri T. Nagi Reddi :—From Dr. Radhakrishna's Report... "Kannada serves the needs of the Kanarese area; and the Bombay serves the great cosmopolitan centre."

The Hon. Sri S. B. P. Pattabhirama Rao :—What about other Universities?

Sri T. Nagi Reddi :— A region like Madhya Bharat will require a University. Mithila has a linguistic heritage. U. P. has six Universities. Madras has three, each to serve the needs of a fairly distinct area.

The Hon. Sri S, B. P. Pattabhirama Rao :—

I would like to ask the Hon. the Leader of the Opposition one point. Is it stated that one linguistic area should have only one University?

Sri T. Nagi Reddi :— Yes, Sir. If you want, I will read that too.(Interruption: It is not unanimous.) I do not say that whole of the

report is unanimous. "In establishing new Universities, consideration should be given to regional needs, whether the region be linguistic, cultural, or economical.' అనికూడా ఉంది

The Hon. Sri S. B. P. Pattabhirama Rao — Please read the whole sentence.

Sri T. Nagi Reddi :— I shall read it · "This mention of the problem of regional location of urban universities, even where only political and linguistic regions are involved, indicates the complexity of the issues. In establishing new universities consideration should be given to regional needs, whether the region be linguistic, cultural or economic" May I ask the Hon. Minister what is the linguistic regional need, what is the cultural need, or what is the economic need for the new university ?

Sri G. C Kondaiah — On a point of information, Sir మన Education Minister గారు మాట్లాడుతూ, రెండేండ్ల time వరకు residential University కి వొప్పుకుంటూ వుంటున్నారు. ఈ బిల్లుమీద మాట్లాడుతూ, ఆ అయిదు జిల్లాలలోని colleges ను గురించి జవాబుచెప్పలేను. ఈ రెండుఏండ్లను గురించి చెప్పటం అనేది కేవలం సభ్యులను మభ్యపర్చటమే అని చెబుతున్నాను. తరువాత, Chapter 1, Section (4) లో "The Madras Act, 1923 (Madras Act VII of 1923) and the Andhra University Act, 1925 (Madras Act II of 1926) shall not, after the commencement of this Act, apply in areas to which the provisions of this Act apply." అని వున్నది.

I want clarification on this provision.

The Hon. Sri S B P. Pattabhirama Rao — వారువేసిన ప్రశ్న నాకు ఆశ్చర్యముగా వున్నది. మొదట యీబిల్లు, వెంటనే ఆ colleges ను affiliate చేయాలనే వుద్దేశ్యంతో తయారుచేయబడినది. అందువల్ల వెంటనే ఆ amendment ను accept చేస్తే, consequential amendments వస్తాయి.

Sri G. Latchanna :—On a point of information, Sir. ఒక వేళ consequential amendments దానికి తెస్తే, అప్పుడు ఆ అయిదుజిల్లాల కాలేజీ Colleges యొక్క పరిపాలన Andhra University క్రింద సాగుతుందని ఆ తీర్మానం యొక్క భావం. అయితే, Madras University examination కు appear అవుతూ, రాయలసీమ 4 జిల్లాలలోని కాలేజీల విద్యార్థులు Andhra University courses క్రింద syllabus follow అవుతూ, మళ్లీ రెండుసంవత్సరాల తరువాత తిరుపతి విశ్వవిద్యాలయంకు వెళ్లటం విద్యాభివృద్ధికి భంగకరం కాదా ?

The Hon. Sri S. B P Pattabhirama Rao — అది విద్యార్థుల విద్యాభివృద్ధికి భంగకరంకాదు. కొంచెము సఫవృగానే వుంటుంది రాబోయేద్లు నెల్లూరు కళాశాలలు ఆంధ్రవిశ్వవిద్యాలయంలో వుండి, ఆ తరువాత కావాలంటే అవన్నీ కలిపి తిరుపతి విశ్వవిద్యాలయమునకు తీసుకువెళ్లిన సులభంగా వుంటుంది. ఇప్పుడు S. S L C. పరీక్షలు ఎట్లా అవుతున్నవి? అక్కడవున్న విద్యార్థులకు ఒక Moderation Board యిక్కడ వున్న విద్యార్థులకు యింకొక Moderation Board వున్నాయి ఇందులో అభ్యంతరం యేమీ లేదు.

Sri Vavilala Gopalakrishnaiah — అక్కడవున్న students ను యిక్కడకు, ఇక్కడవున్న students ను అక్కడకు కలిపితే affiliation అవుతుందా? లేక colleges ను కలుపుతే affiliation అవుతుందా? మంత్రిగారివద్ద నుంచి clarification కావాలి.

The Hon. Sri S. B P. Pattabhirama Rao — శ్రీ గోపాలకృష్ణయ్య గారు confuse చేయాలని చెబుతున్నారు. వారికి అర్థమయ్యే, వారు ఆవిధంగా చెబుతున్నారని అనుకొంటున్నాను.

Sri T. Nagi Reddi — మీరు confuse చేస్తే, వారు confuse అయ్యారని అనుకొంటున్నాను.

The Hon. Sri S B. P. Pattabhirama Rao. — వారి వుపన్యాసాలు విన్నాను. వారినే నేను confuse చేస్తే, అందుకు సాధన్యవాదాలు.

Deputy Speaker :—Now the question before the House is "that the Sri Venkateswara University Bill, 1954 (L. A. Bill II of 1954) as amended by the Select Committee be taken into consideration." ఇది వోటుకు పెడుతున్నాను.

The Hon. Sri S. B. P. Pattabhirama Rao :— ఉపాధ్యక్షా! ఈ బిల్లును House యొక్క consideration కు పెట్టమని కోరుతున్నాను.

Deputy Speaker :— ఈ బిల్లును Consider చేయమని House ముందు పెడుతున్నాను.

**The question is:**

**"that the Sri Venkateswara University Bill 1954 (L. A. Bill. No. 11 of 1954.) as amended by the Select Committee be taken into consideration."**

**The motion was carried.**

**Deputy Speaker :—** ఈ బిల్లును క్లాజ్ వారీ చర్చకు పెడుతున్నాను.

Sri Pillalamarri Venkateswarlu — ఒక విషయం చెప్పాలి. ఇప్పుడు సాధారణంగా "delete the words" అనేదానికి top ప్రయారిటీ ఇవ్వాలి. అది Parliamentary practice గా ఉంది. శ్రీవిశ్వనాథంగారు కొంచెం ఓపికపడితే చదువుతాను. Delete అని చెపితే ఒకమాటతీసి ఇంకోమాట పెట్టడం. దానికి top priority ఇవ్వాలని ఉంది ఇది May's Parliamentary Practice లో 481 వ పేజీలో ఉంది.

"An amendment to leave out and insert words, where it occurs at the same place in a Bill, as an amendment to leave out words only, takes precedence.', అని ఉంది.

Sri T. Nagi Reddi — ఇది చాలా clear గా ఉంది. దాన్ని నేను explain చేస్తాను. Delete అని ఒక amendment వస్తుంది ఒక amendment ఫలానా words తీసి ఫలానాది పెట్టండి అని వస్తుంది. To leave out words అని ఒకటి వస్తుంది. ఇప్పుడు ఇవి ప్రధానమైన amendments. ఎవరైనా 'insert' అని చెప్పితే ఈ 'delete' అని ఇచ్చిన amendments తరవాత 'insert' అనేది వస్తుంది... Entire clause ను leave out చేయాలనేదానికంటె మిగతా amendments first న ఉంటాయి. అట్లాగే 'an amendment to leave out' అనేదానిని మనం జాగ్రత్తగా చూడాలి. అది ఒకటి మీ దృష్టికి తీసుకువస్తున్నాను.

The Hon. Sri T. Viswanatham :— ఇప్పుడు జరుగుతున్న వ్యవహారం సభ్యులు గమనించవలసి ఉంది. The Bill as amended by the Select Committee be taken into consideration అని చెప్పారు. దానిమీద procedure నిర్ణయించుకుంటే బాగుంటుందని వారు ఈ sentence చదివారు. ఏదిముందు తీసుకోడం అనేది ప్రస్తుతవాంశం కాదు. ఇది సాధారణంగా voting లో వస్తుంది. అయినప్పటికీ చర్చ ప్రారంభం కాకముందే ఆయన చెప్పారు. ఇప్పుడు ఈ చర్చ stop చేయవచ్చు.

The Hon Sri S B. P. Pattabhirama Rao .— Clause by clause చర్చచేయాలని చెప్తున్నాను. 35 వ Clause ఏమైనా మార్పులుకూడా రావలసి ఉంటుంది. దాన్ని ముందు పెట్టమని చెబుతున్నాను.

Sri Vavilala Gopalakrishnaiah :— మొదట clause నుంచి రావలసిందని విన్నవిస్తున్నాను.

Deputy Speaker.— 2 వ clause దగ్గరనించి discussion కు తీసుకుంటాను.

Sri Vavilala Gopalakrishnaiah :— Point of order, Sir.

Deputy Speaker :— Point of order ఏమీ లేదు. 2 వ clause నుంచి discussion కు తీసుకుంటున్నాను.

Sri Vavilala Gopalakrishnaiah :— మొదటిదానినుంచి తీస్కో రావా లని నేను Point of order రెయిజ్ చేస్తున్నాను. ఎందుచేతనంటే మొత్తం discussion అంతాకూడా దానిమీద ఆధారపడి ఉంది దానికి ప్రాధాన్యం ఇచ్చి దానిమీద discussion ప్రారంభించడం మంచిదని నేను విన్నవించుకుంటున్నాను.

The Hon. Sri T. Viswanatham :— అన్ని Bills లోను first clause ఏ రూపంలో వుంటుందో ఈ బిల్లులోనూ first clause ఆ రూపంలోనే ఉన్నది. సరైన రూపంలోనే ఉన్నది. ముందున్న notification కూడా ఒకేవిధంగా ఉంటుంది. దానికి కూడా యిందులో ప్రత్యేకమైన రూపంలేదు. Short title లోకూడా ఏమీ మార్పులేదు. This Act may be called అనే start అవుతుంది. The Act extends to అని, ఏ బిల్లులో అయినా సరే ఈ బిల్లులో ఉన్న విధంగానే వుంటుంది. The Act extends to agency area అనో ఏదో ఉంటుంది. notification ప్రతి దానిలోనూ ఒకలాగే ఉంటుంది. అన్నిటిలోనూ first clause ఒకటే. ఈ Bill లోని first clause కూడా అన్ని బిల్లులలోని first clause ల లాగే ఉంది. ఇపుడు ఈ బిల్లు లోని first clause లో మొదట ఉన్నదంతా మామూలుగా అన్ని బిల్లులలోనూ ఉండే టటువంటి material లాంటిదే తప్ప ఏమీ కాదని నేను చెప్తున్నాను. అందుచేత first clause తీసుకోకుండా second clause తీసుకోడానికి వీలుంటుంది.

Sri Vavilala Gopalakrishnaiah :— మనదంతా గజం మిథ్యా పలాయనం మిథ్యా అన్నట్టుగా ఉంది. అందువల్ల extends అన్నప్పటికి, ఈ extends అన్నది ఇక్కడ చాలా చిత్రంగా ఉంది. దానినిచూచినట్లయితే ఇదేమిటో అర్థంకాకుండా ఉంది. ముందుగా దీనినిచూచిన వెంటనే define కాదు. లేకపోతే ఒకపనిచేసిఉంటే బాగుండేది. అదేమిటంటే first section కి కూడా, second section కి యిచ్చినట్లుగా definitions యిచ్చి, దానిపై discussion కు అవకాశం యివ్వాలి అని నేను మనవి చేస్తున్నాను. తరువాత, మీరు ఏ రూలింగ్ యిస్తే ఆ ruling యివ్వండి

Sri K. Krishna Rao :— Order of clauses ప్రకారం sections 1, 2, 3 అయినతరువాత, section 4 ను తీసుకోవడమనేది ఉంటుంది. ముందు, 1, తరువాత 2 వ section ఉంటుంది కాని, 2 వ section తీసుకొన్నతరువాత, 1, 3 sections రావు. అసలు ఒక అర్డరు ప్రకారం తీసుకోవాలి. ఈ విధంగా తీసుకోవడం ఏ Procedure లోనూ లేదు. ఏ ప్రొసీజరులో ఉందో మాపెడితే మేముకూడా చూడడానికి వీలుంటుంది. ఆ rule ఏదో చూపెడితే మీరు ఈ విషయమై సరైన ruling యివ్వడానికి వీలవుతుంది.

Sri C. V. K. Rao :— అధ్యక్షా! చాలా controvertial గా ఉన్న clause పై చర్చ జరుపబోతున్నాము. దానికి ముందుగా ఈ colleges యొక్క affiliation గురించి,

affiliated colleges గురించిన నా amendment ఉంది. అది ఈ affiliation and affiliated colleges మొదలైన మాటలనే ఈ clause లో నుంచి ముందుగా తీసివేయాలని. దానిని మీరు omnibus amendment అని కాని, కంగారు amendment అని కాని అనవచ్చు. ఈ బిల్లులో affiliating, affiliation, affiliated colleges, అనేటటువంటి affiliating కి సంబంధించిన మాటలన్నీకూడా omit చేయాలని ఆ amendment లో ఉంది. అది 24 వ amendment. అసలు ఈ clause పై ఇప్పుడు చర్చ జరిగేటట్లయితే ఇది ముందుగనే చర్చించబడాలి ఆలాగయితేనే ఈ విషయంగురించి ఈ clause లో ఉన్న సమస్య పరిష్కారం అవుతుంది. నా amendment ను చదువుతాను.

"In the Bill, omit all such words aud references made to affiliation, and affiliated colleges."

Sri G Latchanna —Point of order, Sir వచ్చిన amendments లో కొన్నిమాత్రమే circulate అయాయి. కొన్ని circulate అవలేదు. Circulate అవని వాటిలో నాదొకటివుంది. అదేమిటంటే, 6 మాసాలు అయినతరువాత ఈ బిల్లునుగురించి చర్చించాలని, ఈవిధమైనది ఇంకొకటి circulate అయినది. దానిని చర్చించకుండా ఈ clauses ను గురించి అపుడే చర్చించడం సబబుగాలేదు. ఇది అర్థరుకాదు. ముందు దీనిని గురించి చర్చించిన తరువాత ఈ బిల్లులోని clauses గురించి చర్చించవలసి ఉంది.

The Hon Sri T Viswanatham .— ఇది ఈ సమయంలో పెట్టవలసిన amendment కాదు అది వారికి తెలియదా? తెలుసు ఊరికే ఏదో అడ్డుతగలాలని చెప్పారు. C. V K. Rao గారు general గా చెప్తూ ఏదో ఒక సూచనను వారి amendment ద్వారా చేశారు. వారు ఈక్లాజ్ కు 3 amendments యిచ్చారు. వారు యిచ్చిన amendments general గానే ఉన్నాయి. ఇటువంటిది, ఏ legislation లోను ఉండదు. ఈ amendments ను వారి ఉద్దేశ్యాలకు అనుగుణంగా ఇచ్చారని అన్నారు. ఆ amendments బిల్లులోని clause కు సంబంధించినవిగా లేవు. మొత్తం మన శాసనసభకు general direction అన్నట్లుగా యిచ్చారు. ఈవిధంగా ఏదేశంలోను Legislation జరగదు. ఆయనకూడా Chairman of a Municipal Council సాధారణంగా ఇలాంటివ్యవహారం ఆయనకు తెలిసే ఉంటుంది. తెలిసికూడా ఆయన ఎక్కడా ఏ legislation లో లేనివిధంగా ఇక్కడ వ్యవహారం చేయాలంటారు. వావిలాల గోపాల క్రిష్ణయ్యగారున్నారు, వారు కొంచెం serious గా చెప్పారు. ఈ బిల్లులో clause 1 అని, తరువాత clause 2 అని వరుసగా ఉన్నాయి, కనుక ఆ వరుస ప్రకారం ముందుగా 1 వ clause, తరువాత 2 వ clause తీసుకోవాలి అని చెప్పారు. ఈ విషయం వారు చాలా సీరియస్ గా చెప్పారు. వారు దాదాపు 2½ సంవత్సరములుగా ఉమ్మడి మద్రాసురాష్ట్రంలో ఈలాంటివిషయాలను చూస్తూవచ్చారు. కాలవైపరీత్యంవల్ల అక్కడ అపుడు ఆయనకు సవ్యంగా కనబడినవన్నీ ఇప్పుడు ఇక్కడ అపసవ్యంగా కనబడుతున్నాయి.

[Sri T. Viswanatham] [29th May 1954

ఉన్న clauses ను వరుసగా తీసుకొని చివరకు Preamble ను తీసుకోవడం సాంప్రదాయం. ఈ విషయాలలో వారికి చాలా అనుభవం ఉన్నది. ఈ పద్ధతి చాలా దేశాలలోని Parliaments లోను, మనదేశపు అన్ని Assembly లలోను అందరూ ఒప్పుకొన్నటువంటి పద్ధతే. "మొట్టమొదట 1 వ clause 2 వ clause తీసుకోకుండా 3 వ clause తీసుకోవలసిందని మంత్రిగారు కోరారు, ఆవిధంగా 1 వ clause 2 వ clause తీసుకోకుండా 3 వ clause తీసుకోవడం సక్రమం కాదని" క్రిష్ణారావుగారు అన్నారు. ఈ విధంగా జరగట మనేది, ఏ శాసనసభలోను క్రొత్తకాదు, ప్రపంచానికే కొత్తకాదు. ముందుగా ఏదైనా తీసుకోవచ్చు. ఆఖరున preamble వస్తుంది. మొత్తంమీద ఈ Bill పాస్ కావలసింది అని నేను మనవిచేస్తున్నాను.

Sri T. Nagi Reddi — అధ్యక్షా! ఈవిధంగా మొదటి clause ను మొట్ట మొదట తీసుకొనకుండానే మిగతా clauses మీద ఒకసారి మద్రాస్ ఎసెంబ్లీలో చర్చ జరిగింది. అపుడు అక్కడ Speaker గారు అదికూడా శాసనసభా సంప్రదాయమే, అలా చేయడానికి వీలుందని విపులీకరించి చెప్పారు. మనం ఇక్కడ ఆ procedure నే follow అవుతూ వ్యవహారం నడుపుకుంటూ ఉన్నాము కాబట్టి ఇపుడు ఇక్కడ ఉన్నటువంటి బిల్లులో ఉన్న clause లను చర్చకు పెట్టేవిషయంలో మంత్రిగారు ఇచ్చిన సూచనలు బాగానే ఉన్నాయనుకుంటాను ప్రతిపక్షసభ్యులు అంతా మంత్రిగారు చేసిన సూచనలతో అంగీకరించుతున్నారు. ఈ 3 వ clause II Chapter లో ఉన్నది. ఈ chapter ఈ 3 వ clause తోనే ఆరంభం అయింది ఈ 3 వ క్లాజ్ లోని 2 వ sub-clause చాలా ముఖ్యమైంది. దానినిగురించి ముందు చర్చించితే Affiliating University ఉండాలా Residential University ఉండాలా అన్నసంగతి తేలిపోతుంది. తీవ్రంగా దీనిపై చర్చ సాగవలసి ఉంది. అందుచేత దానిని ప్రప్రథమంగా చర్చించడానికి, పూర్తిచేయడానికి వీలుంటుంది. అందుచేత దానిని ముందు చర్చకు తీసుకుంటే బాగుంటుంది. దానిని ముందుగా చర్చించడానికి మంత్రిగారు చెప్పినసూచనను అనుసరించడము భావ్యమని నేను అనుకొంటున్నాను.

Deputy Speaker :— సరే అట్లాగేతీసుకొందాముండి.

Sri T. Nagi Reddi :— ఇపుడు మనం చర్చిస్తున్నటువంటి residential లేక affiliating అనేటటువంటిది ప్రధానమైన సమస్య ఈ 2-వ sub-clause ఈ సమస్యకు సంబంధించినది. అందులో

"(2) It shall be a Residential, Teaching and Affiliating University and shall consist of a Chancellor, a Pro-Chancellor, a Vice-Chancellor, a Senate, a Syndicate and an Academic Council; it shall be a body corporate having perpetual succession and a common seal and shall sue and be sued by the said corporate name."

అని ఉన్నది. దీనికి Lakshminarayana Reddi గారు amendments ఇచ్చారు. Y V Krishna Rao గారు 4 వ clause కు amendment యిచ్చారు. sub-clause 1 కి యింకా amendments ఉన్నాయి. ఇప్పుడు గీనితో ప్రారంభించడం ఉత్తమమని నేను అనుకుంటున్నాను.

Deputy Speaker — సరే అట్లాగే తీసుకుందాము. clause (3) sub-clause (2) చర్చకు పెడుతున్నాను.

Sri N V L. Narasimha Rao — ప్రతిపక్షనాయకులు clause 3, sub-clause 2 ను ముందు తీసుకోవాలని చెప్పారు. clause 3, sub-clause 2 కు ఇంకొక amendment ఉన్నది. అందులో ముందుగా Residential and Teaching University గా start చేసి 1956 వ సంవత్సరంనుంచి అక్కడ ఉన్నటువంటి కాలేజీలను affiliate చేసుకోవాలని ఉన్నది, కేవలం ఒక affiliating అనే అందులో లేదు. అందుచేత ఈ amendment ను ముందుగా తీసుకోవాలని మనవిచేస్తున్నాను.

Deputy Speaker — 3 వ claues లో (1) (2) (3) sub-clauses ఉన్నాయి. వాటిలో (2) వ sub-clause తీసుకుంటే ఎలా ఉంటుంది.

Sri T. Nagi Reddi — అదే బాగుంటుంది. ఈ (2) వ sub-clause ను మంత్రిగారు మొదట move చేసినట్లయితే, మిగతావారు తమ తమ amendments move చేస్తారు. మిగతా business తేలిక అయిపోతుందని అనుకుంటున్నాను.

The Hon Sri T. Viswanatham .—confusion లేకుండా clause 3 అంతా Move చేస్తే బాగుంటుంది. వోటింగుకు పెట్టేటప్పుడు 1, 2, 3, 4 క్లాజులను ముందూ, వెనుకా పెట్టవచ్చు ఇప్పుడు clause 3 అంతా move చేస్తే తీరిపోతుంది.

Sri T. Nagi Reddi :— చిన్న difference వున్నది. మంత్రిగారు సలహా చెప్పినట్టు మొదట affiliating యూనివర్సిటీ కావాలని pass చేసినతరువాత కూడా నెల్లూరు వుంచాలా లేదా అని తగువురావచ్చు. First-clause తీసుకున్నట్లయితే నెల్లూరు విషయం తగువు వస్తుంది. మొత్తం clause అంతా move చేసినట్లయితే యిబ్బంది వుంది.

The Hon. Sri T. Viswanatham :— Sub-clause (1), sub-clause (2) move చేద్దాం తగాయిదా లేదు. వోటుకు పెట్టడంలో అది ఆలోచించుకోవచ్చు. దానివల్ల ప్రమాదం లేదు.

Sri T. Nagi Reddi :— Confusion లేకుండా వుండడానికి 2 వ sub-clause యం తేల్చుకుంటే మిగతావి అన్నీ consequential amendments గా త్వరగా అయిపోతాయి కాబట్టి యీ రెండవ sub-clause ముందు తీసుకోవడంవల్ల మనకుని తేలి కవుతుందని నేను అభిప్రాయపడుతున్నాను.

The Hon. Sri S. B. P. Pattabhirama Rao :—ప్రతిపక్షనాయకునితో ఏకీభవిస్తున్నారు. Affiliating లేకపోతే first sub-clause రానేరాదు. Second sub-clause తీసుకొన్నతరువాత first Sub-clause తీసుకురావచ్చు. అన్నిటికంటె ముందు 2 వ sub-clause వోటింగుకు పెట్టవచ్చు.

I move

"Clause 3, sub-clause (2) It shall be a Residential, Teaching and Affiliating University and shall consist of a Chancellor, a Pro-Chancellor, a Vice-Chancellor, a Senate, a Syndicate and an Academic Council; it shall be a body corporate having perpetual succession and a common seal and shall sue and be sued by the said corporate name."

Sri N V. L. Narasimha Rao — Affiliation వున్నదీ లేనిదీ తేల్చుకుంటే 3 వ క్లాజులో 1 వ సబ్ క్లాజుమీదవున్న amendments చర్చకు, వోటుకు రాకపోవచ్చు. Affiliation వీలు కాదని తేల్చుకుంటే ఆ మొదటి సెక్షను పోతుంది. అందుచేత, మొట్టమొదట ఆ సెక్షను తీసుకుని మాట్లాడండి. Voting వచ్చినపుడు affiliating అన్నదానిమీద పెట్టుకోండి.

The Hon. Sri S. B P. Pattabhirama Rao ·— క్లాజులోని important sub-clause తీసుకుని amendments ప్రతిపాదించడం సరియైనవిషయం Sub-clause (2) is more important. Affiliating గా వుండడమో Residential గా వుండడమో తేల్చుకోవాలి. Residential అని తేలిపోతే తక్కిన జిల్లాల విషయం రాదు. అందుచేత sub-clause (2) మీద మిగతావిషయాలు concentrate అవుతున్నాయి. అందుచేత దానిని ముందు తీసుకుని amendments ను discuss చేసి voting అయినతరువాత amendments pass అయితే దానిప్రకారం మిగతావి చేసుకోవచ్చు.

Sri N. V L. Narasimha Rao :— రూలింగు యివ్వాలని ఒక విషయం గురించి అడుగుతున్నాను. ఇప్పుడు prose order లో చదువుకుందాం 3 వ Clause 2 వ Sub clause కు చివర add "after the end of 1956—academic year" అని సవరణపంపించాం. 2 వ Sub-clause కు affiliate after 1956' అని నా amendment. దానిని అంగీకరించి నట్లయితే నాకు అభ్యంతరంలేదు. అప్పుడు 'Residential' అనీ రెండు 'Affiliating after 1956' అనీ రెండు సవరణలుంటాయి, మా సవరణలు చర్చకు రావడానికి మాకు permission ఇప్పించండి

The Hon. Sri N. Sanjeeva Reddi :—సర్దుకుంటే సరిపోతుంది, 2 వ సబ్ క్లాజులో residential లేక affiliating అనే విషయం తేల్చుకోండి. దీనిపైనే debate

29th May 1954]

Deputy Speaker —Sub-clause (2) పైన Sri M V. సుబ్బారెడ్డిగారు సవరణయిచ్చారు. ఈ amendment ను discuss చేసినతరువాత నరసింహారావుగారి amendment వస్తుంది.

Sri C V. K. Rao — క్లాజు (3) సబ్ క్లాజు(2) కు నా amendment కూడా వున్నది

The Hon Sri S B P Pattabhirama Rao — నేను sub-clause (2) move చేశానండి.

Sri T Nagi Reddi —Sub-clause (2) కు సంబంధించిన amendments కొన్నివున్నాయి. వాటన్నిటినీ ఒకరితరువాత ఒకరు move చేస్తే ఎవరైనా వాటిపై మాట్లాడడానికి వీలుంటుంది. Clause (3), sub-clause (2) పైనవచ్చిన సవరణలు ప్రతిపాదించవచ్చు moved now.

Sri C. V. K Rao — అధ్యక్షా! sub-clause (2) కు నేను యిచ్చినటువంటి amendment move చేస్తున్నాను.

Deputy Speaker — నేను చెప్పినతరువాత order లో move చెయ్యండి.

Sri D. Seetharamaiah — నా పేరునవున్న amendment ను ప్రతిపాదిస్తున్నాను.

'In sub-clause (2), for the words, " Residential, Teaching and Affiliating University" substitute the words "Residential and Teaching University" and make consequential changes in the Bill.'

The amendment was duly seconded.

Sri M. Venkatasubba Reddi :—I move :—(1) In sub-clause (2) after the words "Residential and Teaching," insert the words ' to start with'.

(2) After the word 'and' occurring in line 1 and before the word 'affiliating', insert the words 'shall be.'

(3) After the words "Affiliating University", insert the words and figures, "from 1956 academic year".

The amendment was duly seconded.

Sri T. Lakshminarayana Reddi :—Sir, I move :

In Clause 3, sub clause 2, delete the words "and affiliating".

The amendment was duly seconded.

Sri Pillalamarri Venkateswarlu :—I move :

"In sub-clause (2)delete the words 'and Affiliating" and insert the word 'and' between the words 'Residential' and 'Teaching' ",

The amendment was duly seconded.

Sri Y. V. Krishna Rao.—I am not moving my amendment.

Sri N. V. L. Narasimha Rao — In view of Sri Subba Reddi's amendment, my amendment becomes unnecessary.

Sri Vavilala Gopalakrishnaiah — అధ్యక్షా! Sub-clause 2 కు నా amendment లు ఉన్నాయండి.

Deputy Speaker — మీ amendment ఉన్నదా?

Sri Vavilala Gopalakrishnaiah :— 2 వ పేజీలో ఉన్నది. In sub-clause 2 for the words 'Teaching and Affiliating University' substitute the words "and Teaching University."

The amendment was duly seconded.

Sri C. V. K. Rao :—Sir, I move.

In clause 3, sub-clause 2, delete the words "and Affiliating" and insert the word "and" between the words "Residential" and "Teaching."

The amendment was duly seconded.

Deputy Speaker :— ఇంకా ఏమైనా సవరణలు ఉన్నవా?

Sri Vavilala Gopalakrishnaiah — Amendment లు చదవండే అర్థంకావడం లేదు. మాకు ఇచ్చిన కాగితంలో లేనివి move చేయడం జరిగింది. మేము ఇచ్చిన amendment కంటికి అగపడకుండా మేము notice ఇచ్చినతరువాత వచ్చిన amendment లు move చేయడం జరుగుతోంది. Move చేసే amendment లు order లో పెట్టిఇస్తే బాగుంటుంది.

Deputy Speaker :— ఇప్పటివఱకూ వచ్చిన amendment లు list out చేశారు. మొత్తం amendment ల list అంతా నా చేతులో ఉన్నది. మీ చేతులో కనిపించకపోతే నేను ఏమి చేస్తాను.

Sri Vavilala Gopalakrishnaiah :—Reception office కు వచ్చాయి. ఆఫీసులో వెతికాం కనిపించలేదు. ఆ list అందరికీ ఇప్పించమని అడుగుతున్నాను.

Sri M. Venkatasubba Reddi :— అధ్యక్షా! ఇంతకుముందు వెంకటేశ్వరా యూనివర్శిటీపై మాట్లాడుతూ రెండుపర్యాయాలు ప్రజాసోషలిస్టుపార్టీ విధానం విస్పష్టంగా ప్రకటించివున్నాం. మొట్టమొదట విశ్వవిద్యాలయం ప్రారంభించే సందర్భంలో అది stage by stage గా ఏర్పాటుకావలసి యుంటుంది. కాబట్టి ప్రారంభదశలో Residential and Touching అని ఉంటే కొంతకాలం విర్వహింపబడిన తరువాత .... ...

Deputy Speaker :— ఒక్కనిమిషం ఉండండి. Finance Minister గారు ఏదో చెప్పబోతున్నారు.

29th May 1954]

The Hon. Sri T. Viswanatham — "Shall be" అనేదానికి బదులు "shall be also" అని కలపాలి. ఆ amendment ఉన్నది. ఉన్నట్లే pass ఐతే 1956 తరువాత it won't be a Residential University It will be a Residential, Teaching and Affiliating University

Sri T. Nagi Reddi — Also అని కలపమంటారా ?

Sri M. Venkatasubba Reddi — I accept the Hon Law Minister's amendment. యూనివర్శిటీలు అనేకం ఉండవచ్చును, కాని ఒక్క రాష్ట్రంలో ఒకటికన్న ఎక్కువ Residential, Teaching and Affiliating యూనివర్శిటీలు ఉండుటకు వీలులేదని అలాంటివి ఎక్కడైనా ఉన్నవా అని నాగిరెడ్డిగారు ప్రశ్నించారు. ఐతే U.P. రాష్ట్రంలో అంతకుముందు ఆగ్రా యూనివర్శిటీయున్నా, అలహాబాదు కూడా రెండవ affiliating యూనివర్శిటీగా ఏర్పాటైన విషయం మనదేశంలో నేయున్నది. అసలు affiliating అనే పదం ఉపయోగించడమే మహాపాపం అన్నట్లుగా వెంకటేశ్వర్లు గారు ప్రసంగించారు. మొన్న ఈ బిల్లుపై మాట్లాడుతూ, కమ్యూనిస్టుపార్టీ విశ్వవిద్యాలయం affiliating గా ఉండాలని ఎక్కడ ఏ సందర్భంలో చెప్పాము' అన్నారు. నేను ఆసందర్భం quote చేయంటే వారు ఒప్పుకోరు. "ఆంధ్రరాష్ట్ర కమ్యూనిస్టుపార్టీ దృక్పథం" అనే కరపత్రంలో విశాలాంధ్ర 1952 డిసెంబరు 25, 26, 27, తేదీలలో కమ్యూనిస్టుపార్టీ ఈ విషయమై ఒక Sub-committee వేసింది. అందులో నాగిరెడ్డి, చంద్రరాజేశ్వరరావు, పిల్లలమర్రి వెంకటేశ్వర్లు, Y ఈశ్వరరెడ్డి, Y. V. క్రిష్ణరావుగారలను ఉపసంఘంగా నియమించినట్లు ఆ ప్రకటనలో యున్నది. విశాలాంధ్ర పత్రికలో ప్రత్యేకసంచికలో ఈ విషయం ప్రకటించారు. దానిలో రాయలసీమ కాలేజీలకు మదరాసు విశ్వవిద్యాలయంనుంచి వేరుచేసి రాయలసీమకు ప్రత్యేకంగా తిరుపతి విశ్వవిద్యాలయం స్థాపించాలని స్పష్టంగా యున్నది.

"రాయలసీమ కాలేజీలను మద్రాసు యూనివర్శిటీనుంచి వేరుచేసి రాయలసీమకోసం ప్రత్యేకంగా తిరుపతి విశ్వవిద్యాలయము స్థాపించవలెను." అంటే దానిని పలువురు ఏ విధముగా వ్యాఖ్యానించింది, కమ్యూనిస్టుపార్టి ఏ విధంగా వ్యాఖ్యానించింది అందరు విన్నారు. ఇప్పుడు తిరుపతిలో స్థాపించబడే విశ్వవిద్యాలయం రెండుసంవత్సరముల తరువాత 1956 వ సంవత్సరంలో తప్పనిసరిగా affiliating విశ్వవిద్యాలయం చేయవలెనని చెబుతూ ఈ అవకాశం ఇచ్చినందుకు ధన్యవాదాలు అర్పిస్తున్నాను.

Sri Vavilala Gopalakrishnaiah :— తిరుపతిలో రెసిడెన్షల్ యూనివర్శిటీ పెట్టడం చాల మంచిది అని నా అభిప్రాయం. ఈనాడు తిరుపతి దేవాలయంలో డబ్బు ఉన్నందువల్ల ఆ డబ్బును సద్వినియోగము చేయడానికి మార్గములు కనబడనందువల్ల ఈ బిల్లును తీసుకొని వచ్చామని మంత్రిగారు అన్నారు. మద్రాసు విశ్వవిద్యాలయంనుంచి బయటికి తీసుకొని రావడం చాల అవసరమనికూడ చెప్పారు. ఇదివరకు జరిగిన చరిత్ర

జ్ఞాపకము పెట్టుకుంటే ఆంధ్ర విశ్వవిద్యాలయం విషయంలో పూర్వం అనేక ఒడంబడికలు జరిగినాయి. తిరుపతి దేవాలయానికి డబ్బు ఉంది. అది కాకుండా, సదాశివయ్యరుగారు చాలకాలం క్రిందనే బిల్లును తయారుచేశారు. ముఖ్యంగా రంగధామరావుగారు చెప్పినరీతిగ అచట Residential యూనివర్సిటీ పెట్టడం మంచిది. శ్రీబాగు ఒడంబడిక ప్రకారం అమలుజరగాలి అంటే రాయలసీమకళాశాలలు కూడ ఆంధ్రవిశ్వవిద్యాలయానికి కలుపవలసిన అవసరంవుంది. ఆంధ్ర విశ్వవిద్యాలయమును ఉన్నతస్థితికి తీసుకొనివచ్చుటకు అవకాశం వుంటుంది సమగ్రంగా చేయగలమను విశ్వాసము ఉంది. తిరుపతిలో Residential University పెట్టడం బాగాఉంటుంది. ఇతరయూనివర్సిటీల ఆదర్శములను చెప్పడం నా ఉద్దేశం కాదు. Residential యూనివర్సిటీగా ఉంటే అభివృద్ధిచేయడానికి బాగా ఉంటుంది. ఇది నా అభిప్రాయం.

The Hon. Sri T Viswanatham — అది చాల incorrect.

Sri Vavilala Gopalakrishnaiah — ఇష్టముఉన్నా లేకపోయినా విన్నవలసిన బాధ్యత సభ్యులకు తప్పదు ఈ విశ్వవిద్యాలయానికై వెంకటేశ్వరస్వామి ధనమును సద్వినియోగము చేయమని కోరుతూఉన్నాను.

Sri T Nagi Reddi — దీనినిగురించి చెప్పవలసినది అంతా చెప్పివేశాను. ప్రత్యేకంగా చెప్పవలసిన అవసరంలేదు కారణాలు విపులంగాచెప్పాను. మంత్రిగారు చెప్పడానికి జవాబు ఎప్పటికప్పుడు చెప్పివేశాను.

Residential గాక affiliating చేస్తే మహా పాపము అని కమ్యూనిస్టులు చెపుతున్నారని అంటూఉన్నారు. రెండు సంవత్సరాలు రెసిడెన్షల్‌గా పెట్టండి అనడం ఎంత హాస్యాస్పదమో నేను ప్రత్యేకంగా చెప్పవలసిన అవసరంలేదు. ఇప్పుడు affiliating చేసి తరువాత దానిని రెసిడెన్షలుగ మార్చుటకు వీలు అవుతుంది అనికూడా కొందరు అన్నారు. రెసిడెన్షలుగా experiment చేసి, develop చేసినతరువాత affiliating చేయండి అంటే దానికి rhyme and reason ఉంది. విశ్వవిద్యాలయం రాయలసీమకు అవసరం అని ఎన్నడో చెప్పాము. అనంతపురంలో పెట్టుకొంటారా, పెట్టుకోండి. తిరుపతిలో పెట్టుతారా, పెట్టుకోండి. యూనివర్సిటీకేంద్రం రాయలసీమలో పెట్టుకొనడం అవసరమని బహిరంగంగా చెప్పాము విశ్వవిద్యాలయకేంద్రం రాయలసీమకు అవసరమని గట్టిగా చెప్పాను. అవసరం లేదని చెప్పినవాండ్లతో నేను వాదించాను. మా కార్యక్రమంలో వడిదుడుకులు లేవు. ఈ రెంటిని మేము simultaneous గ చెప్పుతూవచ్చాము. మేముచేసినది ఏమీలేదు అని మీరు చెపుతున్నారు.

రెండు సంవత్సరాలు residential గా ఉంచి తరువాత affiliating గా మార్చినందువల్ల విద్యార్థులకుగా ఏమీ నష్టంలేదని చెప్పారు. రెండుసంవత్సరాలు మద్రాసు యూనివర్సిటీలో ఉంచాము.

Madras University లో వున్నటువంటి Colleges ను, ఆంధ్ర University లో చేరిస్తే మద్రాస్ యూనివర్శిటీ courses ను, రెండుసంవత్సరాలు యిక్కడ బోధించాలన్న మాట మళ్లా యీ కాలేజీలను Tirupati University లోకి మారిస్తే, యిక్కడి కోర్సులు, అక్కడ రెండుసంవత్సరాలు నడుపుతారన్నమాట. సక్రమమైన పునాదులపై విశ్వవిద్యాలయమును స్థాపించలేరన్నమాట. రెండుసంవత్సరములు Residential University గా తయారై ఆ తరువాతసంవత్సరములో Affiliating University గా మార్చాలని చెప్పారు. ఇది ఎంత ప్రమాదకరమైందో, ఆలోచించుకున్నారా? ప్రభుత్వం ఎట్లా ఒప్పుకుంటున్నదో తెలియకుండావున్నది. దీనివల్ల కొత్తగా రాబోతున్న University కి ఎంతో యిబ్బందిగావుంటుంది. ఒక విశ్వవిద్యాలయాన్ని నిర్మించే విషయంలో serious గా ఆలోచనలుజరుగుతూవుంటే, వాటిని దాటుకుంటూపోవటం, ఎంత అసాధ్యమైన కార్యక్రమమో చెప్పనవసరములేదు. దీనిలోని బండారం తెలుసు రాజకీయప్రయోజనాలకొరకు చేస్తున్నపని ఇది. రెండుసంవత్సరములవరకు Residential గా వుంచి, ఆ తరువాత Affiliating అని చెప్పటం Tirupati University ని భగ్నపరచటానికే. ఆంధ్రదేశానికి ఒక Affiliating University వుండనేవున్నది. ఇక్కడ లేనటువంటి Residential University ని ఏర్పాటుచేసి, ఈ రెండూగూడా ఒకదానితో ఒకటి కలసిమెలసివుండేటట్లున్నూ, ఆంధ్రదేశంయొక్క భావికి అవుసరమైనటువంటి అవుసరాలను తీర్చడానికి, ఈ శాసనసభ సక్రమమైన నిర్ణయాలను చేస్తుందని ఆశిస్తున్నాను. రాజకీయాలకుమాత్రం ముడిపెట్టే ాగున చేయవద్దని కోరుతున్నాను. ఇది విద్యార్థులయొక్క జీవితసమస్య. వారిజీవితమును నాశనముచేయవద్దని కోరుతున్నాను. ముందు residential గాను, ఆ తరువాత affiliating గాను చేయవద్దని విజ్ఞప్తి చేస్తున్నాను. అటు ఇటు గాకుండా "సంధిగ్ధ దశ" రానివ్వవద్దని కోరుతున్నాను. సంధి కొట్టకుండా రక్షించవలెనని కోరుతున్నాను. మీ చేతులతో దానికి గోతులు త్రవ్వకుండా న్యాయంచేయుమని విజ్ఞప్తిచేస్తున్నాను.

Sri R. Lakshminarasimham Dora.—Mr. Speaker, Sir, I would like to speak for just two or three minutes, because in the Select Committee stage I was keeping rather neutral on this very important question of affiliation or no affiliation. I think I owe an explanation to the House as to why I took such an attitude then. At the time when the original Bill was under our consideration, I felt that the Bill was creating a separate unit or a Pakistan out of the Andhra University for the Rayalaseema people, because constitutionally the senate, the syndicate and other bodies of the University were entirely kept exclusively for the Rayalaseema people. So at that stage I could not make up my mind. Subsequently certain amendments were carried in the Select Committee by which other districts were also coming into that University and I felt that what was considered

was for the whole of Andhra and not exclusively for the Rayalaseema. So I have taken a definite opinion about it and am giving my vote.

Now the point that I am addressing myself to is whether this question of affiliation after two years is a thing really worth considering. It is unnecessary to go into the question now whether it should be affiliating or residential University because, after two long days' debate, Mr. Subba Reddi's amendment comes in as a golden mean. For two years the University can devote itself for the development of various courses without being bothered by such questions as affiliation and laying out various courses and examinations in the different colleges. It can devote all its attention towards the one single purpose of developing courses for these two years which go to make a good University. It is not the number of colleges or the Vice-Chancellor or the Registrar or such things that make a University useful. What is wanted is good courses for these Universities. Government can devote some money for this and Venkateswara Devasthanam money also is there. With all this money they can develop the courses and afterwards think of affiliating the colleges in the Rayalaseema area and making a full-fledged University. There may be bickerings and heart burning here and there, but in course of time all these things will vanish. In these two years' time Government can do much useful work in the matter of research and other aspects. I therefore support the amendment of Mr. Subba Reddi.

The Hon Sri S. B P Pattabhirama Rao —దీనిమీద చర్చ సమగ్రంగా జరిగిందని చెప్పవచ్చును. ఇందులో రెండు points వున్నాయి. వాటినిగురించి చెబుతాను. శ్రీ వెంకటసుబ్బారెడ్డిగారి amendment మీరు విన్నారు. ప్రతిపక్షనాయకులు దానిమీద విమర్శిస్తూ ఇందులోకి రాజకీయాలను తీసుకొనిరావద్దని చెప్పారు. ఇక్కడ ఎవరుచెప్పినా, నేను చెప్పినా, రాజకీయాలను యిక్కడకు తేవద్దనీ, వాస్తవిక దృష్టితో మాత్రమే పరిశీలించ మనీ కోరుతున్నాం. సుబ్బారెడ్డిగారు చెప్పినట్లుగా ఇప్పుడు residential గా ఏర్పాటుచేసి, రెండుసంవత్సరాల తరువాత affiliating గా చేయమనే విషయంలో కూడ నాగిరెడ్డిగారు ఒప్పుకోవటం లేదు. Residential గానే పెట్టాలని అంటున్నారు. వెంకటసుబ్బారెడ్డిగారు చెప్పిన సలహా కొంతవరకు బాగుంది. దొరగారు చెప్పినట్లు "కొంతకాలము చూచి కావలె నంటే residential గా మార్చుకొని అన్ని కాలేజీలను ఆంధ్రయూనివర్శిటీలో చేర్చా లనే" ఇంకో అభిప్రాయంవుంది. ఇందులోవున్న point ను meet అవటానికి కొంతవరకు వీలువుంది. ముందు Affiliating University గా start అయితే కొంతకాలమైన తరువాత, అప్పుడు legislature లో మనమే వుంటామనుకోండి, మన వీలునుబట్టి మరల శాసనసభలో చర్చించుకొని మార్చుకోవచ్చును. కాబట్టి ఇప్పుడు ఈ రెండువిశ్వవిద్యాలయాలను కూడా సమానంగా చూచుకోటానికి అవకాశం వుంటుంది. ఇందువల్ల విద్యార్థులకు నష్టం

29th May 1954]

వుంటుందని, నేను అనుకోను. విశ్వవిద్యాలయం మారవచ్చును. కాని విద్యార్థులకు మాత్రం కోర్సులు పాత University కి సంబంధించినవే వుంటాయి. పరీక్షలుకూడ అవే. అక్కడ జరిగేపరీక్షలు, యీ క్రొత్త University ఆధ్వర్యంలో జరుగుతాయి

వెంకటసుబ్బారెడ్డిగారు తెచ్చిన amendment ను నేను accept చేస్తున్నాను ఆప్రకారం చేయవచ్చుననికూడ చెబుతున్నాను.

Sri G Latchanna — మంత్రిగారు చెప్పేదాన్నిబట్టి 2 సంవత్సరములు ఆది బాగా develop అయినతరువాత అవసరమైతే affiliating గా చేసుకోవచ్చును, లేకపోతే విరమించుకోవచ్చును అన్నట్లుగా అర్థమాతున్నది. ఆవిధంగా ఉంటుందా, లేకపోతే automatic గా రెండు సంవత్సరములైన తరువాత Affiliating University అయిపోతుందనే ఉద్దేశ్యమా, వివరముగా చెప్పవలసిందని కోరుతున్నాను.

The Hon Sri S B P. Pattabhirama Rao — ప్రత్యేకంగా "shall be" అని నేనని నపుడు నా explanation బట్టి ఎందుకు సందేహంకలిగిందో తెలియడం లేదు.

Sri G. Latchanna — మంత్రిగారి explanation బట్టి సందేహంవచ్చింది. వారు చెప్పడంలో అవసరమైతే కావలసివస్తే అని ఈవిధంగా 3, 4 పదములు వాడుటవల్ల ఈ ప్రశ్న అడగవలసివచ్చింది.

Sri N. V. Rama Rao — రెండు సంవత్సరముల అనంతరం మళ్లీ అసెంబ్లీలో consider చేస్తాము అని అన్నారు. కనుక ఇది మళ్లీ రెండుసంవత్సరాలైన తరువాత consideration కు వస్తుందా లేక 2 సంవత్సరములైనతరువాత automatic గా Affiliating University అవుతుందా.

The Hon. Sri S B P Pattabhirama Rao .— Automatic గా అయిపోతుంది, ఎప్పుడు తీసుకొని రాదలచుకొంటె అప్పుడు తీసుకొనిరావచ్చునని అన్నాను. ఈ రోజు pass చేసింది రేపు nullify చేయాలనుకొంటే చేయుటకు కాదా. కనుక దీంట్లో వివాదము ఏమున్నది.

Sri Pragada Kotaiah :— మంత్రిగారు సెలవిస్తూ M వెంకటసుబ్బారెడ్డి గారి సవరణను అంగీకరించామని అన్నారు. అంతవరకు బాగానే ఉన్నది. అయితే area of operation నుంచి నెల్లూరును తొలగించడానికి ప్రభుత్వము అంగీకరించిందాలేదా ? ఈ విషయంలో వారి అభిప్రాయమేమిటి తెలియజేయవలసిందని కోరుతున్నాను.

The Hon. Sri S. B. P. Pattabhirama Rao — రెండు సంవత్సరముల వరకు నెల్లూరు ఆంధ్రవిశ్వవిద్యాలయములో ఉంటుంది. తరువాత రాయలసీమ 4 జిల్లాలతో పాటు అదికూడ అక్కడకు వెళ్లుతుంది.

Sri G. Latchanna — ఈ మధ్యకాలములో ఆ 4 జిల్లాలయొక్క fate ఏమిటో కాస్త చెప్పమని కోరుతున్నాను.

Deputy Speaker :— ఈ amendment కూడ వచ్చింది.

[29th May 1954

Sri T. Nagi Reddi — ఈ రెండుసంవత్సరముల కాలములో ఆ 5 జిల్లాల యొక్క కాలేజీలు ఎక్కడ ఉంటాయి? అవి ఎక్కడో ఒకచోట ఉండాలికదా ఎక్కడ ఉంటాయి?

Sri G. Latchanna — 'The Madras University Act 1923 and the Andhra University Act 1925 shall not, after the commencement of this Act, apply in areas to which the provisions of this Act apply" అని క్లాజు accept చేస్తే ఈ మధ్యకాలంలో ఇవి ఎక్కడ ఉంటాయి? వీటికి త్రిశంకస్వర్గమేనా? ఆ 4 జిల్లాలు ఎక్కడ చేర్చుతారు. దీనికి సరియైన సవరణ చేయవలసియుంటుందని మనవిచేస్తున్నాను.

Sri R. Lakshminarasimham Dora:— There is absolutely no doubt about it because clause 1 (4) says, "The Madras University Act, 1923 and the Andhra University Act, 1925 shall not, after the commencement of this Act, apply in areas to which the provisions of this Act apply". Affiliation commences only after 2 years and till then the *status quo* will be maintained and Mr. Subba Reddi's amendment is not inconsistent with clause 1 (4) and I think it is also the view of the Government.

Sri T. Nagi Reddi:— Does it reflect the opinion of the Government? I want to know.

The Hon. Sri T. Prakasam:— Is the Opposition entitled to rise at each stage and question?......

Sri T. Nagi Reddi:—Yes. When there is fundamental difference it is necessary that we understand each other. What is the position immediately this clause is accepted? "The Madras University Act and the Andhra University Act shall not after the commencement of this Act, apply to areas to which the provisions of this Act apply". Do those Colleges remain with the Madras University or come to the Andhra University or they will not get affiliated to any University?

The Hon. Sri S. B. P. Pattabhirama Rao : — ఈ Act అమలులోకి వచ్చినప్పటినుంచి 1956 వరకు ఆంధ్రవిశ్వవిద్యాలయంతో కలిసి ఉంటాయి.

Sri C. Pulla Reddi .— అధ్యక్షా! మాకష్టసుఖాలు కొంచెం ఆలోచించండి ఇది చాలా ముఖ్యమైనటువంటి తీర్మానం. 1956 లో ఒక affiliating విశ్వవిద్యాలయం ఏర్పడుతుందని అన్నారు. ఈ రెండు సంవత్సరములవరకు రాయలసీమ కాలేజీలు వెంటనే ఈ బిల్లుతోపాటు ఆంధ్రయూనివర్సిటీకి వస్తారా లేక మద్రాసు యూనివర్సిటీలోనే ఉంటారా! అని అడుగుతున్నాను. ఇది మంత్రిగారు వివరించలేదు.

29th May 1954]

The Hon. Sri S B P. Pattabhirama Rao — చెప్పనుగదండీ, చెప్పలేదని అంటారు

Sri G. Latchanna — ఈవిషయంలో ప్రభుత్వంయొక్క అభిప్రాయాన్ని ఆచరణలో తీసుకురావడానికి ఒక amendment అవసరమని అధ్యక్షులవారికి మనవి చేస్తున్నాను.

Sri Pillalamarri Venkateswarlu — మద్రాసు University లో ఉన్నటువంటి రాయలసీమ కాలేజీలు ఆ యూనివర్శిటీనుంచి disaffiliate చేసి ఆంధ్ర యూనివర్శిటీకి affiliate చేయడానికి ఈ బిల్లులో provide చేస్తారా అని అడుగు తున్నాను. ఈ విషయంలో ఒకో మంత్రి ఒకో విధంగా చెప్పుతున్నారు. సంజీవరెడ్డిగారు ఒకటి చెప్పితే మరొకరు ఇంకొకటి చెప్పుతున్నారు.

Sri T. Nagi Reddi — ఆయన ఏమీ చెప్పలేదండీ ఇంతవరకు.

The Hon Sri S B. P Pattabhirama Rao — అధ్యక్షా, నేను ఈవిషయం clear గా చెప్పాను. పదేపదే మళ్లీ అదే ప్రశ్న వేస్తే నేను చెప్పలేను. ఆ clause వచ్చినప్పుడు ఆ అభిప్రాయం వ్యక్తం చేసుకుందాము. దానికి ఏమి ఉన్నది. 1956 వరకు ఆ కాలేజీలు ఇక్కడే ఆంధ్రయూనివర్శిటీలో work చేస్తాయి అని చెప్పాను.

Sri T. Nagi Reddi :— ఆంధ్రయూనివర్శిటీలో చేరతాయి అనే clause పెట్టకపోతే ఎట్లా చేరతాయి.

The Hon. Sri S. B. P Pattabhirama Rao :— ఆ concerned clause వచ్చినప్పుడు పెడతాము.

Deputy Speaker :— ఇప్పుడు move చేసినటువంటి amendments అన్నీ ఒకేలాగున ఉన్నవి గనుక ఒకే amendment House ముందు పెడతాను.

Sri Vavilala Gopalakrishnaiah :— దీంట్లో రెండు రూపాలున్నాయి. 1956 వరకు అనేది ఒకటి, అసలు affiliation లేకుండానే ఉండాలి అనేది రెండవది. ఈ విధంగా ఇవి రెండురకాలుగా ఉన్నాయి.

Deputy Speaker :— C V K. Rao, Pillalamarri Venkateswarlu గార్ల amendment ఓటుకు పెడుతున్నాను.

**In Sub-clause (2) delete the words "and Affiliating" and insert the word "and" between the words "Residential" and "Teaching".**

**The motion was put to voice vote and declared lost. The Opposition Members pressed for division.**

# SRI VENKATESWARA UNIVERSITY BILL

## 29-5-1954 (5-38 p.m.)

## Amendment of Sri C. V. K. Rao and Sri P. Venkateswarlu

The House divided thus.—

### AYES

1. Sri T. Nagi Reddi
2. „ Pillalamarri Venkateswarlu
3. „ M. Hanumantha Rao
4. „ K. Venkaiah
5. „ M. Veerabhadram
6. „ G. Satyanarayana
7. „ K. Govinda Rao
8. „ G. Yellamanda Reddi
9. „ V. Sri Krishna
10. „ Chandra Ramalingaiah
11. „ N. Sivarami Reddi
12. „ A. Venkataramaraju
13. „ V. Rama Rao
14. „ B. Lakshminarasa Raju
15. „ P. Rama Rao
16. „ C. Pulla Reddi
17. „ G. Bapanayya
18. „ C. V. K. Rao
19. „ K. Rajagopala Rao
20. „ D. Seetharamaiah
21. „ T. Potha Raju
22. „ P. Venkatasiviah
23. „ Saka Venkata Rao
24. „ B. Sankarayya
25. „ G. Rama Rao
26. „ P. S. Ramachandra Rao
27. „ K. Subba Reddi
28. „ G. Anjaneyulu
29. „ G. Joseph
30. Sri M. Narayanaswamy
31. „ K. Malakondayya
32. „ K. Krishna Rao
33. „ Vavilala Gopalakrishnaiah
34. „ M. Bapaiah Chowdary
35. „ G. Latchanna
36. „ K. Pattabhiramiah
37. „ G. C. Kondiah
38. „ T. Lakshminarayana Reddi
39. „ I. Gangayya Naidu
40. „ M. Kune Rao
41. „ G. Nageswara Rao
42. „ P. Narasimha Reddi
43. „ P. Bapu Naidu
44. „ R. Venkatajagga Rao
45. „ P. Syamasundara Rao
46. „ C. Prabhakara Chowdary
47. „ Kavali Narayana
48. „ S. Kasireddy
49. „ D. Lakshmayya
50. „ K. Ranga Rao
51. „ N. V. Rama Rao
52. „ P. Pundarikakshacharyulu
53. „ R. Siddanna Goud
54. „ K. Appala Naidu
55. „ S. Vemiah
56. „ K. V. Ramesam
57. „ K. Ramiah Chowdary

Ayes - 57

### NOES

1. The Hon. Sri T. Prakasam
2. „ N. Sanjeeva Reddi
3. „ K. Koti Reddi
4. „ T. Viswanatham
5. „ D. Sanjivayya [Rao
6. „ S. B. P. Pattabhirama
7. „ P. Thimma Reddi
8. Sri P. Ranga Reddi
9. „ P. Gopalakrishna Reddi
10. „ L. Lakshmana Das
11. „ K. V. Vema Reddi
12. „ B. Krishnamurthy Rao
13. „ K. Varadachari
14. „ K. Balanarayana Reddi
15. „ V. V. Krishnam Raja Bahadur
16. „ P. Sangamnaidu
17. „ H. Ramalinga Reddi
18. „ P. Satyanarayana Reddi
19. Sri G. Nagabhushanam
20. „ P. Venkataswami Reddi
21. „ K. Adikesavalu Naidu
22. „ D. Ramabrahmam
23. „ H. Satyanarayana Dora
24. „ T. C. Atchannaidu
25. „ P. Venkatasubbayya
26. „ K. Shanmugam
27. „ K. Suryanarayana
28. „ N. Sankara Reddi
29. „ T. N. Venkatasubba Reddi
30. „ M. R. Appa Rao
31. „ T. Mallayya
32. „ Ch. S. R. V. P. Murthy Raju
33. „ K. Venkatanarayana Dora
34. „ N. Chenchurama Naidu
35. „ V. Chidanandam
36. „ G. Sivasankara Reddi

NOES

37 Sri S Narayanappa
38 ,, K Santhappa
39 ,, Ch Indrayya
40 ,, Thota Ramaswamy
41 ,, R B V Sudarsana Varma
42 ,, M Doraikannu
43 ,, P Gunnaya
44 ,, N Ramabhadra Raju
45 ,, R Lakshmi Narasimham Dora
46 ,, Y Audinarayana Reddi
47 ,, Srungaram
48 ,, K Veeranna Padal
49 ,, Pragada Kotaiah
50 ,, Y V Krishna Rao

NOES

51 Sri K Ramaiah
52 ,, Adi Neeladri Rao Reddi
53 ,, D Basavi Reddi
54 ,, K Ramamurthy
55 ,, B Ramakrishna Reddi
56 ,, Bhojja Appalaswamy
57 ,, K Bapanna Dora
58 ,, M Venkata Subba Reddi
59 ,, K Venkata Kurmi Naidu
60 ,, K V S Padmanabha Raju
61 ,, M Subba Reddi
62. ,, K Venkata Shetty

Noes: 62

NEUTRAL

Sri N V L Narasimha Rao

The amenedment was lost.

Deputy Speaker.— తరువాత amendment వోటుకు పెడుతున్నాను అది శ్రీ వెంకటసుబ్బారెడ్డిగారి amendment.

Sri T Nagi Reddi.—ఇక్కడ శ్రీ వెంకటసుబ్బారెడ్డిగారి amendments మూడు వున్నవి. అందులో యేది ?

Deputy Speaker — ఆ విషయమే చెబుతాను.

Sri T Nagi Reddi.— వారిచ్చిన ఆ amendment చదవండి.

The Hon. Sri T. Viswanatham :—

For the words "It shall be a Residential, Teaching and Affiliating University," substitute the words "it shall be Residential and Teaching to start with and shall be also an Affiliating University from the academic year 1956." అని వస్తుంది వారి సవరణ.

Deputy Speaker.—This is the amendment. For the words "It shall be a Residential, Teaching and Affiliating, University" substitute the words "It shall be Residential and Teaching to start with and shall be also an Affiliating University from the academic year 1956."

ఇది House వోటుకు పెడుతున్నాను. దీనికి అనుకూలురు 'yes' అని, ప్రతికూలురు 'no' అని చెప్పండి.

The amendment was carried.

Sri G. Latchanna :— On a point of clarification, Sir. ఇంతకు ముందు మంత్రిగారు ఈ కాలేజీలు Andhra University లోనే రెండు సంవత్సరముల వరకు వుండేటట్లు ఆదరిమిలా వెంకటేశ్వర విశ్వవిద్యాలయానికి కలుస్తాయని చెప్పారు కాబట్టి, దానికి suitable clause ను, యీ బిల్లులో చేర్చటమే కాకుండా, Andhra University Act ను amend చేయటం అవసరంవుందని, అందువల్ల Andhra University (Amendment) Bill యొక్కటు తెస్తారని నేను కోరుతున్నాను.

Sri C Pulla Reddi — ఇప్పుడు మంత్రిగారు ఆ హామీయే యిచ్చారు. దానినిబట్టి ఆ సంవత్సరంలో తెస్తారని మనం అనకోవచ్చును

Deputy Speaker — Sub-clause 2 as amended-ఓటుకు పెడుతున్నాను.

The motion was carried

Sub-clause (1)

Deputy Speaker — ఇపుడు sub-clause (1) చర్చకు పెడుతున్నాను.

Sri T Nagi Reddi — ఇప్పుడు మనం pass చేసినదానికి, దీనికి సంబంధం లేదనుకుంటున్నాను. "Thereshall be constituted in and for the area comprising the districts of Anantapur, Cuddapah, Kurnool, Chittoor, and Nellore a University by name Sri Venkateswara University" అనిఉన్నది It is incongruous and it conveys no meaning కాబట్టి sub-clause (2) ప్రకారం దీన్ని సవరించమని చెపుతున్నాను.

Sri G Latchanna — రెండుసంవత్సరాలవరకు ఇందులో ఉంటుందని చెపుతున్నారు కాబట్టి ఒకటవ సబ్‌క్లాజును రెండుసంవత్సరాలతరవాత move చేసుకుంటే బాగుంటుంది.

The Hon. Sri S. B. P. Pattabhirama Rao :— Clause (3) sub-clause (1) కు "Provided it shall take effect only from the academic year 1956." అని proviso కలుపవచ్చును.

Sri Pillalamarri Venkateswarlu .— ఇంకో new sub-clause లాంటిది చదివారు. ఒక clause కు amendments ఇచ్చారు. దాన్ని మళ్లీ మీరు కొంచెం change చేశారు. కాబట్టి దాన్నికూడా మేము కొంచెం చూచుకోవాలి. అలా కాకుండా దాన్ని మీరు వెంటనే ఒప్పుకోవాలని చెపుతున్నారు.

Sri Vavilala Gopalakrisnaiah .— ఒక clause కి కొన్ని మార్పులు వచ్చినప్పుడు దానికంతకి సంబంధించిన ఇతర clause లో కూడా కొన్ని consequential amendments వస్తాయి.

The Hon. Sri S. B. P Pattabhirama Rao :— అధ్యక్షా! దీనికి consequential amendments వస్తాయి. కాబట్టి ఇప్పుడు సభ adjourn చేసి, సోమవారం ఈవిషయం తీసుకుంటే amendments ఇవ్వడానికి వారికికూడా వీలుంటుంది.

Sri Vavilala Gopalakrishnaiah .— అధ్యక్షా! తమరు announce చేసేదానికంటె ముందుగానే చెపుతున్నాను. సోమవారం ప్రొద్దున్న కాస్త తెలవుఇచ్చి సోమవారంమధ్యాహ్నం సభ పెట్టకుంటే బాగుంటుంది.

Deputy Speaker :— నేటికి ఈ సభాకార్యక్రమం ముగిసింది. తిరిగి సోమవారం మధ్యాహ్నం రెండుగంటలకు ప్రారంభమౌతుంది.

**The House then adjourned to meet again at 2 p. m. on Monday the 31st May 1954.**

Sree Rama Press, Madras-21.

14-6-1955